ఓమ్.

శ్రీ

# మహావాక్యదర్పణము.

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్య

ప్రణీతము.

ఇది

కోపూరిలో ప్రబుద్ధాశ్రమస్థులగు

కోపూరు పట్టాభిరామశర్మగారిచే

రచియింపబడిన

తెలుఁగు పద్యములతోడంజేర్చి

ఏలూరు మంజువాణీ ముద్రాక్షరశాలలో

ముద్రితమై

ప్రచురింపఁబడియె.

1919

 [వెల 0-8-0

శ్రీరామ.

# పీఠిక.

హరిః ఓం

సీ. ఆదినారాయణు సబ్జసంభవుని వ
　　　సిష్ఠసంయమి శక్తి శ్రీపరాశ
రుని వ్యాసమునిచంద్రుని శుకయోగీంద్రు
　　　గౌడపాదాచార్యు ఘనతపస్వి
గోవిందయోగీంద్రుని గురువర్యు శంకర
　　　భగవత్పదాచార్యు వారిశిష్యు
లగు పద్మపాదుని హస్తామలకు తోట
　　　కప్రముఖ్యవార్త్తికకారులాది

తే. గీ. గాగలుగు బ్రహ్మవిద్యాప్రకాశకులను
　　నాత్మగురువర్యులనునెంచి యట్టిగురుప
　　రంపరకునెల్ల వినయసంభ్రమములొప్ప
　　వందనములాచరింతు నానందమలర.

ఇంతు స్మరింపఁబడిన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్యులగు శ్రీశంకర భగవత్పాదాచార్యులవారే యిప్పటికి దాదాపుగ రెండువేల సంవత్సరములక్రిందట మనదేశమున పరమ శివాంశమున నవతరించి వేదవిరుద్ధ మతములనెల్ల రూపుమాపి యౌపనిషదమగు నద్వైతమతమును ప్రతిష్ఠించి దిగ్విజయముచేసి సర్వజ్ఞపీఠమెక్కిన మహామహిమమూర్తి. వైదిక మతోద్ధరణమున కై యీ మహాభాష్యస్వాములవారనేక గ్రంథములు రచియించిరి. అవి బ్రహ్మసూత్రభాష్యము, గీతాభాష్యము, ఉపనిషద్భాష్య

ము, సనత్సుజాత పర్వ భాష్యము, నృసింహోత్తరతాపిన్యుపని షద్భాష్యము మున్నగు భాష్య గ్రంథములును, ఉపదేశ సహస్రి, వివేక చూడామణి, అపరోక్షానుభూతి, ఆత్మబోధ, మహావాక్య దర్పణము నను పంచరత్నములనంబడు ప్రకరణములును, శ్రీ దక్షిణామూర్తిస్తుతి మొదలగు నసంఖ్యాత పరశివపరదేవతాదిస్తుతులును నైయున్నవి. శ్రీ వారు రచియించిన గ్రంథములెన్నియని గాని యివ్వియనిగాని యిప్పటికి నిర్ణీతములై యుండలేదు. ఆవిష యము ముందుకొంచెము విస్తరించి చెప్పెదము. ప్రకృతవిషయ మగు శ్రీ మహావాక్యదర్పణము లోకమునకు నాచార్యులవారు నిర్వ్యాజ కరుణతో ననుగ్రహించిన యమూల్యకృతిరత్నములలో నొక్కటి. 'చూడామణి' యని వారేపేర్కొన్న శ్రీ వివేకచూడా మణిలోని 'బ్రహ్మతత్త్వమసి భావయాత్మని' యను నుపదేశ వాక్యమునే విపులముగా నిజశిష్యులకుపదేశించిన తెఱంగున 'శ్రీ గురురువాచ' అనియిందు శ్రీ వారుపన్యసించియున్నారు. కావు ననే ౫౮౩ శ్లోకములు గల సమగ్రప్రకరణమగు శ్రీ వివేకచూడా మణివలె పెద్దదిగాక యిది ౩౦౮ శ్లోకములుమాత్రముగల చిన్నది యైనది. ఐనను దీనియర్థమును గ్రహింప నధికారము జాగ్రదవస్థ సత్యమను మిథ్యాజ్ఞానము నశించినవారికేగాని తక్కినవారికిగాదు. ఈయర్థమిందలి

"మిథ్యేతి మన్యతే స్వప్నం..."

అను మొదటిశ్లోకమే స్పష్టపఱచుచున్నది. స్వప్నప్రాయము గా దోచుచున్న ప్రకృతినాత్మయందు విలీనముచేసి పురుషునిం బరతత్త్వతాదాత్మ్యదశంబొందించుటే యీప్రకరణము నుద్దేశము.

"రజ్జౌ ప్రతీతో భుజగో..."

అను దీని యంతిమశ్లోకమీయర్థ మేబోధించుచున్నది. ఇట్లు వేదాంతవిద్యాసర్వస్వమును సంగ్రహించి సుబోధముగా నిట్టివెన్నియో గ్రంథములను నిజయశశ్శాసనస్తంభములుగా నెలకొలిపిన లోకోపకారైక దీక్షాదక్షులగు శ్రీ జగద్గురుస్వాములకు మనమెంతఋణస్థులమైయున్నామో తలచిచూతుము. ఈఋణమును మనమెట్లుతీర్చుకొనవలెను? ఇందుకై శ్రీ వారి శిష్యులమైన మనమేమిచేయుచున్నాము? వారు రచియించిన గ్రంథములిన్నియని గాని యివ్వియనిగాని తెలిసికొంటిమా? అవి చేర్చి తప్పులు లేకుండ మంచికాగితములపైన ముద్రింపించితిమా? అవియన్నియైనను, కొన్నియైనను, జదివితిమా? గురుముఖమున వానిలో నిరూపింపబడిన యర్థమును గ్రహించితిమా? తుదకు వారిచరిత్రమైనం జదివి తెలిసికొంటిమా? ఇదేదియుంజేయకున్నమానెంగాని వారిగ్రంథములను ధనార్జనైకదృక్కులమై గాలిపటపుకాగితములపైన తప్పుల తడికలుగా ముద్రించి యమ్ముకొనుచు వారికపకీర్తి తేకున్నసంతేచాలు.

1896 వ సంవత్సరమున చెన్నపురిలోని స్వకీయ విద్యానికేతన ముద్రాక్షరశాలలో శా॥ కల్యాణసుందరశాస్త్రిచే ముద్రింపించ బడిన మాయొద్దనుండు నీగ్రంథమందునకు దగినదృష్టాంతము. శాస్త్రిలవారు దీనిని యథామతిగాఁ బరిష్కరించినట్లు ముఖపత్రమున వ్రాసియున్నారు. ఇందుఁగుంటనవి, అంటీయంటనివి, స్ఖలితములు నగు నక్షరములు లెక్కలేనివి వివిధానర్థహేతువులట్లుండ

శ్లో. మామయంహంతివిషయో బంధకత్వస్వభావతః
నస్నానమంత్రార్చనకీర్తనాదినా నతీర్థసేవాదిచకర్మభిఃక్షో॥

అనునది ౨౨౩ వ శ్లోకముగా ముద్రింపించి దీనిని మేషశీర్షుఁడగు దక్షప్రజాపతింజేసి యుంచినారు. వారిమతి యింతేకాబోలునని యూరకుందుముగాని గ్రంథమును పాడుచేసినందుకు మేము పడు చింతకు మితియేలేదు. ఎంతప్రయాసతోనో యిప్పటిస్థితి కదివచ్చినది. ఇందును ౨౩౭ వ శ్లోకమునకు సందర్భశుద్ధి కానరామి నిది ప్రక్షిప్తమోయని తోఁచెడిని. 162 వ శ్లోకమున "ముముక్షుణాం" అను ప్రయోగమును, 267 వ శ్లోకములో 'ఆత్మక్రీడాత్మమిథున' యను సంధియు, 295 వ శ్లోకమున "యదాహ్యేవైష ఏతస్మిన్నుదరమిత్యేవ హిశ్రుతిః" అను ఛందో లక్షణమును నిట్టి సవరింపరాని దోషము లీగ్రంథమున జొచ్చి యొక్కొక్కతూరియిది శ్రీ శంకరకృతికాదేమో యని సంశయమును మాకేపుట్టించుచున్నది. శ్రీ వివేకచూడామణిని తెనుగుజేయునప్పుడును మాకు నిట్లే యొక తప్పులతడికచిక్కి మమ్ముంబెక్కు చిక్కులనుబెట్టినది. ఐనను బొంబాయిలోని నిర్ణయ సాగర ముద్రాక్షర శాలలో నాగరాక్షర ప్రతియొక్కటి చిక్కి మాకది చాల సహాయపడినది. ఈమహావాక్యదర్పణమనిన నెక్కడ విచారించినను జిక్కదయ్యె శ్రీరంగమువారి "శంకరకృతిరత్న భాండాగారము" లోనైనం జిక్కకపోవునాయని యాసతో వెదకితిమి. లేదు. శ్రీశంకర కృతులని ప్రసిద్ధములైనవి మఱికొన్నియు లేవు. అట్టివికానివి కొన్నియున్నవి. ఇట్లారసి యెందును ననవాప్తమనోరథుండనై చివరకా మేషశీర్ష దక్షుడైన 228 వ శ్లోకమున పూర్వోత్తరార్ధములకు గ్రమముగా నుత్తర పూర్వార్ధములను నేనేపూర్తిచేసి కొని తెనిగించి గ్రంథమునెట్లో యీస్థితికి తేగలిగితిని. ఇందేవైనదప్పులున్న నవి పైన

జెప్పిన శాస్త్రిలవంటివారిచే నుపేక్షించబడిసవరింపరాని స్థితిలోను న్నవిగా భావించి గుణము మాత్రము గ్రహించుడని చదువరుల బ్రార్థించు చున్నాడను.

ఈ సందర్భమున నింకొక్కమాట చెప్పవలసియున్నది. శ్రీశంకర కృతులివియని నిర్ణయింప మనవారేలాటి ప్రయత్నమును జేయుటలేదు. కొంచెము ప్రయాసపుచ్చుకొనిన నీపని సాధ్యముగాకపోదని నానమ్మకము. మహావిద్వాంసులగు శ్రీశంకర శిష్యులెందఱోకలరు. వారీవిషయము నుపేక్షించు టాశ్చర్యముగనున్నది. శంకరకృతులని శ్రీరంగమువారు ముద్రించియుండు శంకరకృతిరత్న భాండాగారములో చేర్చియున్న స్వాత్మనిరూపణమను గ్రంథములోనే చివర నది వారిదికాదని స్పష్టమగు సాక్ష్యమున్నది. ఊరక గ్రంథమునంతయు చదువువారికైననిది తోచకపోదు. ఇంతయేల? మనవారికీవిషయమున శ్రద్ధలేమిజూచి 'విశ్వదాభిరామ వినురవేమ' అని తోక నంటించి యెక్కడెక్కడివో వేమన పద్యములనియు, హాస్యకథల నెక్కడివో తెచ్చి తెనాలి రామలింగనివనియు నిష్టము వచ్చినట్లు చెప్పుచున్నట్లజ్ఞు లెక్కడెక్కడివో గ్రంథములను తెచ్చి ప్రతిష్ఠకొఱకో, వ్యాప్తికొఱకో, మఱియెందులకో శ్రీశంకర భగవత్పాద కృతులని ప్రచురించి శ్రీ వారికపకీర్తి దెచ్చుచున్నారు. "రామనామము" అనుపల్లవితో నెవ్వరో తెనుగున నొకరగడను వ్రాసి దానిచివరను సంస్కృతములో 'ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకర భగవత్పాద విరచితమ్' అని గద్య చేర్చి ప్రచురించియున్నారు. అట్లే చదువుచునున్నారు. ఎంత సాహసము!

ఇప్పుడు మనదేశములో బలిసియుండు "బట్టబయలు" వే దాంతులకు మార్గదర్శియై "అచల" గ్రంథములు చాల వ్రాసి యుండు పోకల శేషాచలం నాయుడనువారు శ్రీకృష్ణ బోధామృత సారమని మంచి పేరుతో నొక సంగ్రామాండు రాజుల కథను వ్రాసి దా నిమిషచేత తమ బట్టబయలు వేదాంతమును బోధించు నావేశ మున మతత్రయాచార్యులనుదూషించినారు. అందు "శ్రీ శంకరా చార్యులవారు నిజమెరింగినవారు గనుకనే దూదేకుల శిద్దప్పకు శిష్యులై యతనివల్ల తీర్థప్రసాదాలు తీసికొని కృతార్థులైనారు" అని నిరంకుశముగా వ్రాసి ప్రచురించియున్నారు.

శ్రీవారి గ్రంథములగతి యట్లుండు శ్రీవారిగతి యిట్లును ధూర్త దూషితములగుచుండ వారిశిష్యులమనుకొనుమన మూరకజడప్రా యులమైయుండుట తెలశ్లించినది. శ్రీవారి శిష్యులింతటనైనను కన్నులు తెరచిచూచి యీ యాపదను తొలగింతురుగాకని శ్రీ వారియందును వారి కృతులయందును గల పరమప్రేమచే పెద్దలనెల్లం బ్రార్థించుచు వినయమున విరమించు

విధవిధేయుడు,
కోవూరు పట్టాభిరామశర్మ.

శ్రీరామ.

శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్యేభ్యోనమః.




ఆంధ్ర పద్య సహితము.

మంగళాచరణము.

ఉ. శ్రీ నెలకొన్న కేరళధరిత్రిని స్వర్ణదిఁబోలుచుండు పూ
ర్ణానది పొంతఁ గాలటి యనంబడు పల్లెను విప్రునింట నీ
శానుఁడు మఱ్ఱిక్రింద మునిసంఘముఁగావఁగఁబుట్టినట్లు వి
ద్యానిధియై జనించిన మహాత్ముని శంకరునిన్ స్మరించెదన్.

ప్రతిజ్ఞాదికము.

తే. గీ. శంకరాచార్యులు దయారసంబుతోడ
శిష్యబోధార్థమై విరచించియున్న
కృతి మహావాక్య దర్పణం బిది తెనుంగు
జేసెదను లోకమునకు మేల్సేయు కొఱకు.

మ. పరతత్త్వం బెఱుఁగంగఁ గోరిన మహాప్రాజ్ఞుల్ నిదానంబుగా
బరికింపందగు దీనిఁ; జిన్నదని చెప్పంబోల; దిందేర్పడన్

బరమార్థం బుపదిష్టమైనది మహావాక్యంబులో; మీకు శం
కరుఁడే చెప్పినయట్టులా నిది సమగ్రంబుగా విమర్శించినన్.

ఆ. వె. గ్రంథమన్న భాష్యకార ప్రణీతంబు
విషయ మాత్మ తత్త్వ వివరణంబు
శ్లోకములకు తెలుగులో పద్యముల్గల
విది ముముక్షువులకు హితముగాదె?

గ్రంథము.

శ్లో. దర్శనం శ్రవణం జ్ఞానం యత్రనాన్యస్య విద్యతే
అఖండైక రసం శాంతం బ్రహ్మ తత్సముపాస్మహే. ౧

చ. కనుఁగొన నెందువేఱొకటి కల్గమి నిక్కువురూపు దాల్చి; యొం
దొనర వినంగ నింకొకటి యుండదు శబ్దపువేసమూని; యొం
దును మఱియొంకు వస్తువెటఁ దోఁపదుపోలనెఱుంగఁబోయినన్
ఘనమగునట్టి శాంతము నఖండరసంబగు బ్రహ్మమెంచెదన్. ౨

శ్రీ గురురువాచ. శ్రీ గురుస్వామి యిట్లనియె.

శ్లో. మిథ్యేతిమన్యతే స్వప్నం జాగరం సత్యమీహతే
బుద్ధేర్విలాస వైచిత్ర్య మాహో అజ్ఞజనాజ్ఞతా. ౩

చ. కలఁగని మేలుకాంచి యది కల్లయటంచు దలంతు రందఱున్
మెలఁకువ మాత్రమట్లనక మేకొని చూతురు సత్యమంచు; నీ

యిల నివిరెంపు బుద్ధి జనియించిన చిత్రపులీలలే గదా?
తెలియనివారి చిత్తముల తీరిది చూడగ వింతయెంతయున్. ౨

శ్లో. శుద్ధి మిచ్ఛంత్యశుద్ధస్య నిత్యదుఃఖాత్మన స్సుఖం
అనిత్యస్యైవనిత్యత్వ మహో అజ్ఞజనాజ్ఞతా. 3

చ. తలపగరాని పెన్మలికి దట్టము దేహము శుద్ధిసేయగా
వలతురు; నిత్యదుఃఖమగు వస్తువునన్ సుఖమొంద జూతురా
శలకు నశాశ్వతార్థముల శాశ్వతసిద్ధి ఘటింపజూతు రీ
తెలియనివారి చిత్తముల తీరిది చూడగ వింతయెంతయున్. 3

శ్లో. ఆత్మ న్యనాత్మతాంకృత్వా హ్యనాత్మన్యాత్మతాంపునః
మృగ్యతే పుస్తకేష్వాత్మా అహో అజ్ఞజనాజ్ఞతా. ౪

చ. తెలియమి నాత్మలేదని మతింపలపోసి యనాత్మజేసి; చం
చలమునవాత్మయౌ తనువుజయ్యనవాత్మనుగా దలంచుచున్
లులితమనీషఁ బొత్తములలో వెదకందొరకొందు రాత్మకై
తెలియనివారిచిత్తముల తీరిదిచూడగ వింత యెంతయున్. ౪

శ్లో. హిత్వాత్మానం సదానంద మాత్మనస్సుఖకామ్యయా
యజంతిదేవాన్ యజ్ఞాద్యైరహో అజ్ఞజనాజ్ఞతా. ౫

చ. గళిత వివేకులాత్మని నఖండిత నిత్య సుఖ స్వరూపుగా
దెలియక యాత్మకున్ సుఖము దేవతలెనంచు మదిందలంచి వే
ల్పులకుఁ బ్రియంబుగా యజనముఖ్య విధుల్ జరిగింతు రక్కటా
తెలియనివారి చిత్తముల తీరిదిచూడగ వింతయెంతయున్. ౫

శ్లో. స్వమేవా కృత్రిమం దేవ మజ్ఞాత్వా ప్రతిమాం జడాః
భజంతి దేవతా బుద్ధ్యా అహో అజ్ఞ జనాజ్ఞతా. ౬

చ. తెలియరకృత్రిమం బయిన దేవునిరూపమె యాత్మయంచుఁ జం
చలమతు లశ్మవిగ్రహముఁ జక్కని దేవుని రూపుగాఁగ బు
ద్ధులఁ దలపోసి మ్రొక్కుదురు తోఁచదువారికి నిక్కమేమియుం
దెలియనివారి చిత్తముల తీరిది చూడఁగ వింతయెంతయున్. ౬

శ్లో. అజ్ఞాత్వా ముక్తమాత్మాన మాత్మనో ముక్తిసిద్ధయే
పుణ్యక్షేత్రేషునివసం త్యహో అజ్ఞ జనాజ్ఞతా. ౭

చ. తెలియరుముక్తుఁడాత్మయని; ధీరతలేకతని న్నిబద్ధుగా
దలచి విముక్తియాతనికిఁ దద్దయుఁ జేకురుసంచుఁ బుణ్య భూ
ముల నివసించుచుందురు విమూఢులుతత్త్వమెఱుంగలేక;యీ
తెలియనివారి చిత్తముల తీరిది చూడఁగ వింతయెంతయున్. ౭

శ్లో. సర్వజ్ఞాతారమాత్మానం విస్మృత్యజ్ఞాతు మిచ్ఛయా
అభ్యస్యంతి మహాశాస్త్రాణ్యహో అజ్ఞ జనాజ్ఞతా. ౮

చ. తెలియునితండు సర్వమును; ధీరుఁడటంచు నెఱుంగరాత్మనిన్;
దెలియఁగఁగోరి తత్త్వమును దెల్పు నటంచు మహాప్రయాసతో
వెలయఁగ నేర్చుకొందు రతివిస్తరశాస్త్రము; లేమిచెప్ప? నీ
తెలియనివారి చిత్తముల తీరిదిచూడఁగ వింతయెంతయున్ ౮

శ్లో. ఆత్మన స్థూలభిన్నత్వం స్వప్నేదృష్ట్వాపి మోహితాః
స్థూలేష్వహంతాం నోముంచంత్యహో అజ్ఞజనాజ్ఞతా. ౯

చ. కలగను నప్పుడీ తనువు కన్నను నాత్మ్మఁను వేఱటంచు ని
ర్మలముగజూచియుండియు నుమాయకులోఁబడిమోహితాత్మ్మలీ
యిలఁగల స్థూలదేహముల నేనను బుద్ధిని మూన; రౌర ! యీ
తెలియనివారి చిత్తముల తీరిదిచూడగ వింతయెంతయుః ౯

శ్లో. మలమాంసమయం దేహం స్వం మత్వాఽశుచి మన్యతు
శుద్ధింకుర్వంతి తోయాద్యైర హెూ అజ్ఞజనాజ్ఞతా. ౧౦

చ. మలమును మాంసముఁగలిసిమైలగుమేనగు; దీనిఁదానుగా
దలచి జనుంను మంచినగు తైలములఁ విమలోదకంబులఁ
జలకములార్చి యెంతో జతనం బొనరింతురు శుద్ధిసేయ; నీ
తెలియని వారిచిత్తముల తీరిదిమూడగ వింతయెంతయుః. ౧౦

శ్లో ద్వయో రన్నస్యకార్యత్వేఽ హంతాంవపుషి కుర్వతే
నమలే బుద్ధివై చిత్ర్యమ హెూ అజ్ఞజనాజ్ఞతా. ౧౧

చ. మలమునుమేను నన్నమున మాఱ్పునవై నవె కావె ? వానిలో
మలమును మాత్రమేవమొయి మానుచు మేనిని నేనటంచుఁగో
మలగతిఁ జూతు; రీవిషమమార్గము బుద్ధి విలాసమే కదా ?
తెలియనివారి చిత్తముల తీరిదిచూడగ వింతయెంతయుః. ౧౧

శ్లో. అసత్కల్పం మృషాప్రాయం స్వప్నతుల్యం భ్రమోదితం
జగత్సర్వమితి జ్ఞేయం పండితై స్తత్త్వ దర్శిభిః. ౧౨

ఉ. కావున లేనియట్టిది వికల్పవుహావము భ్రాంతిఁబుట్టి న
ద్భావముఁబోలెఁ దోఁచు కలవంటిది యీ జగమెల్లనంచు నీ

భావముఁ జిక్కఁగా నరసి బాగుగఁ జిత్తములందు నిల్పి దు
ర్భావముఁ జేరనీక నిలువందగు నిక్కమెఱుంగఁ బండితుల్. ౧౨

శ్లో. జన్మభిఃకోటి పర్యంతైర్నిర్వృత్తైః పుణ్యకర్మభిః
శుద్ధాత్మనాం సతామేవ జిజ్ఞాసాత్మనిజాయతే. ౧౩

తే. గీ. ఎన్ని కోటులో జన్మంబు లెత్తి యెత్తి
వేసరక పుణ్యకర్మముల్ చేసి చేసి
ధూతకల్మషులైన సాధులకె కలుగుఁ
దత్త్వమెఱుగంగఁ గోర్కి చిత్తంబులందు. ౧౪

శ్లో. ఛాందోగ్యోపనిషద్యేత న్మహావాక్యమితీర్యతే
షష్ఠప్రపాఠకే తత్త్వమసీతి ప్రాయశోస్థితల్. ౧౫

శ్లో. తత్రత్యానాం పదానాం యద్ద్వితీయం త్వంపదంస్థితం
తస్యార్థః ప్రత్యగాత్మైవయో౽హ మిత్యనుభూయతే. ౧౬

శ్లో. సహాజంతు పరం బ్రహ్మ కేవలానందలక్షణం
తత్పదస్య భవేదర్థోయః పరాత్మేతి గీయతే. ౧౭

శ్లో. అసీత్యైకత్వమనయో రఖండత్వం మహాత్మభిః
తాత్పర్యేణ శ్రుతిర్వక్తి సర్వజ్ఞా సత్యవాదినీ. ౧౮

సీ. సామవేదాంతమౌ ఛాందోగ్యమున నాఱ
వదియౌ ప్రపాఠకమందుఁ గలదు
విను తత్త్వమసియను విమల మహావాక్య
మందలి పదములయందు రెండ

వది త్వంపదము దాని యర్థమీనేనని
యనుభూతుఁడగు ప్రత్యగాత్మమావె
తత్పదార్థంబు స్వతస్సిద్ధమై కేవ
లానందమగు పరమాత్మయతఁడె.

తే. గీ. వీరి యేకత్వము నఖండ విధముఁ దెలుపు
నసియను పదానపలుమాఱు వినువకుండ
సత్యవాదిని యగు శ్రుతి సర్వమెఱిగి
పరమకృప నస్మదాదులపైన నెఱపి. ౧౪

శ్లో. శ్రుత్వా సమీరిత స్తస్యార్థో మోహాన్నాద్రియతేజనైః
సంసారాబ్ధౌ పతంత్యంధాఇవ తేనైవదోషతః. ౧౫

ఉ. కారుణికత్వమచ్చుపడగా శ్రుతివల్కెను నిట్టిమాటలన్
వేరగనీరు మోహవశ చిత్తులు గావున మూఢమానవుల్
దారుణమైన యీ యఘము తాఁకునసే శద వార లిట్లు సం
సారపయోధి నంధకుల సామ్యమునం బడి మున్గుచుంఢుటల్.

శ్లో. అద్యాష్టమీతి నవమీతి చతుర్దశీతి
జ్యోతిర్విదాం వాచో వదసంతి భక్త్యా
శ్రుతేస్తథాహాత స్త్వమసీతి వాక్యం
న విశ్వాసం త్యద్భుత మేతదేవ. ౧౬

శా. నేడేయష్టమి నేడునున్నవమియు న్నిక్కంబు; జ్యోత్యింబులీ
నాడుల్; నాడునుడీ చతుర్దశి; యనన్ దైవజ్ఞవాక్యంబులన్

ప్రోడల్ సైతము భక్తినమ్ముము; రహో! శ్రుత్యంబ నీవద్దియే
చూడన్నిక్కమటన్న నమ్మ; రిడియే సుండీ విచిత్రంబిలన్.

శ్లో. దుష్టస్య వేద ప్రతిబోధితార్థో విజ్ఞాయతే నైవ యథావ దత్ర
కింత్వన్యథైవ ప్రతిభాతి తద్వత్ఫలంచ తద్రూపకమేవ తస్య.

ఉ. వేదమెఱుంగఁ బల్కెడు గభీరతరార్థము లున్నరీతిగా
నాదరమొప్పఁ దోపవు దురాత్మునకున్; విపరీతరీతినే
వాదమునఁ బోలెఁ దోచు; మతివానికి దాని ఫలంబు నంతయే;
స్వాదుగఁదోచునే జ్వరము వచ్చిన వానికి నేపదార్థమున్?.

శ్లో. ప్రస్తుతం తేప్రవక్ష్యామి తీవ్రమోక్షేచ్ఛ యాశృణు
మోక్షేచ్ఛయాకృతం సమ్యక్ఫలతి శ్రవణాదికం. ౧౦

తే. గీ. నీకునెఱిఁగింతుఁ దత్త్వార్థ నిర్ణయంబుఁ
దీవ్రమోక్షేచ్ఛతోడ సుస్థిరత వినుము
శ్రవణమననాదికములు మోక్షంబు గోరి
చేయఁబడనేని లెస్సగా సిద్ధి నొందు. ౯

శ్లో. ఏకస్య బ్రహ్మణ శ్శుద్ధ సత్త్వోపాధి సమన్వయాత్
ఈశతా జీవతాన్యస్య మలినోపాధి యోగతః. ౧౧

శ్లో. ఉపాధేరేవ మాహాత్మ్య క్షీవాచ్ఛ్యోపితస్య విశేషతః
యథాస్వామాత్య మాహాత్మ్య ర్సేవకాచ్ఛ్రవ ర్తినః. ౧౩

సీ. బ్రహ్మమొక్కటె నిరుపాధికంబై యుండు
దానికి శుద్ధ సత్త్వం బుపాధి
యగుట నీశ్వర భావమయ్యె; నశుద్ధమా
సత్త్వం బుపాధియై జరుగుకతన
జీవత్వ మొప్పారె; సిద్ధ; మిందు నుపాధి
పెద్దదై యీశుండు పెద్దయయ్యె
నదిమూడ సామ్రాజ్య మమరియుండుటఁ జక్ర
వర్తిభృత్యుని కన్న బలియుఁడైన
తే. గీ. యల్లె; యంతయెకాని భేదావకాశ
మేమియును నాత్మయందులే; దీయుపాధి
నాత్మ తానను కొనుటే యనాత్మబంధ
మదియె సంసారబంధంబు నసఁగఁబరగు. ౧౯

శ్లో. సంసారబంధోఽయమబోధ మూలః
కర్మప్రవృద్ధో బహుదుఃఖహేతుః
స కర్మకోట్యాస్య నివృత్తిరివ్యతే
తత్త్వావబోధేన వినాముముక్షోః. ౨౦

క. తనుఁదా నెఱుఁగమిఁబుట్టుగ
ఘనమగు సంసార బంధకంబిది కర్మం
బునఁ బెఱుగు; నెల్లదుఃఖము
లనుఁదాఁగలిగించి యాత్మలగ్గుం జెఱచుఁగా. ౨౧

తే. గీ. కాన నీబంధముమువ మోక్షంబుగోరి
యాత్మ తన నిక్కమా రూపు నరసి తెలియ

వలయు; నంతయె కాని నిష్ఫలనుఁ బూని
కర్మకోట్లాచరించినఁ గాదు; నిజము. ౧౯

శ్లో. తత్త్వావబోధస్తు విచార్యమాణే
సమ్యక్పదార్థే సముదేతి పుంసః
శ్రుతి స్మృతి న్యాయ బలేన బుద్ధ్యా
నస్నానమంత్రార్చన కీర్తనాద్యైః. ౧౫

చ. తన నిజమేర్పడం దెలియఁ దాశ్రుతియుక్తుల బుద్ధిశక్తితోఁ
గొనకొని లెస్సగా నరయ గుట్టు బయల్పడుఁ గాని యేళ్ళలో
మునిగిన దేవతార్చనలు పూనికఁ జేసిన మంత్రకోటులన్
గొణిగినఁ గీర్తనాదులనుఁగూడియొనర్చినఁ గాదొకింతయున్.

శ్లో. నహిస్నాన శతేనాపి రజ్జుసర్పభ్రమో నృణాం
భయకంపప్రదోయాతి వినావస్త్వవమర్శనం. ౧౬

తే. గీ. మనుజుఁడొక త్రాటిఁగని సర్పమనుచు భ్రమసి
భయముపడి కంపమొందుచో వానిభ్రాంతి
త్రాటి నిజమేర్పడగ విమర్శనముసేయ
కెన్ని పెన్నల మునిగినఁ జన్నువిడిచి. ౧౩

శ్లో. సంసారవర్ధకం కర్మ తన్నివృత్త్యై నకల్పతే
నహిపంకస్య పంకేన నివృత్తి రవలోక్యతే. ౧౭

తే. గీ. అంతకంతకు సంసారమధికముగను
జేయుకర్మంబు దానిని జెఱుపఁజాల

దమసుఁ ద్రొక్కినవానికి నమసువలన
నాయమసు పోవునే? మఱింతగునుగాక. ౨౪

శ్లో. అపికోట్యజకల్పానాం కర్మణాముక్తిరిష్యతే
నాంతరాబ్రహ్మ విజ్ఞానం ప్రసాదాదంతరాత్మనః. ౨౫

ఆ. వె. సుకృత మాచరించి శుద్ధచిత్తుండయి
బ్రహ్మమెఱుగముక్తి వడయుఁగాని
కర్మ సమితి బ్రహ్మకల్పకోట్ల నొనర్చు
చున్న నైనముక్తి నొందరాదు. ౨౬

శ్లో. అబ్రహ్మత్వ భ్రమోచ్ఛిత్త్యా త్వహంబ్రహ్మేతినిశ్చయః
జాయతే స్వవిచారేణ పురుషస్య విపశ్చితః. ౨౭

ఆ. వె. ఎఱుకగలిగి పురుషుఁ డిదమిత్థమని వస్తు
తత్త్వమరయఁ బరము దానుగాన
టంచు దోచుభ్రాంతి యణగును; దాబ్రహ్మ
మనెడి నిశ్చయంబు నంకురించు. ౨౮

శ్లో. మిథ్యా జ్ఞానస్య విచ్ఛిత్తిస్సమ్యగ్జ్ఞానేనసిద్ధ్యతి
సమ్యగ్జ్ఞానం పదార్థస్య విచారేణైవనాన్యథా. ౩౦

ఉ. బ్రహ్మమునేనుగాననెడి భ్రాంతిజమైన ప్రతీతిపోవు నే
బ్రహ్మమె వేఱుగా ననెడి వాస్తవదృష్టిపొసంగనేని నీ
బ్రహ్మమునేనెయం చనుభవంబగు త్వంపదతత్పదార్థముల్
జిహ్మతమాని లెస్స పరిశీలనసేఁతనె కాదికేమిటన్. ౩౧

శ్లో. అతో విచారః కర్తవ్యః కర్మసంన్యస్యధీమతా
బ్రహ్మైకత్వబోధార్థం సంసారోయేనశామ్యతి. 3౧

ఉ. కావునధీయుతుండఖిల కర్మములన్ వెసఁద్రోచి యద్దియున్
నీవనుపల్కులంగలుగు నిశ్చయమేర్పడఁగా విచారమున్
భావమునిల్పిచేయఁదగు బ్రహ్మముదానునునొండెయంచు స
ద్భావముదీనిచేఁగలుగు బాయునుసంసృతిదుఃఖమంతయున్.

శ్లో. తత్త్వంపదార్థా సువిచారణీయా
సమ్య జ్మహావాక్యగతౌ ముముక్షుణా
తయోర్వివేకోదయ బోధవహ్ని
స్సంసార బంధం ప్రదహాత్యశేషం. 3౨

మ. ఎదలోనన్విమపొందఁగోరినయతం డీవాక్యమందుండు నీ
వదియన్మాటలయర్థమెల్ల నిపుణుండై చూడనౌలెస్సగా
నదిచూడంబ్రభవించుబోధమను ఘోరాంగారమీసంసృతిన్
గుదురంటందహియించుదుఃఖములడంగున్నిత్యసౌఖ్యంబగున్.

శ్లో. తత్త్వంపదార్థౌ సువిచార్య యేన
బ్రహ్మాహమిత్యేవ ధియాత్వనాత్మని
విధ్వంసితాహంమతి రత్రసద్య
స్సవవకైవల్యసుఖంసమశ్నుతే. 33

మ. ఎవఁడీనీవదియ న్పదద్వయములో నింపొందునర్థంబు లె
స్సనివర్ణించి పరంబెనేననుమతిన్ స్పష్టంబుగాఁబూనువాఁ

డవలీలన్విషుఁ దానుగానియది తానన్బుద్ధి వేత్తై కనం
దావి కై వల్యసుఖంబునంతయును నిందేహొందుధన్యాత్ముఁడై.

శ్లో. ప్రత్యక్త త్త్వంమయా సమ్యగ్బోధ్యతేశ్రూయతాంత్వయా
యద్విజ్ఞానేనసంసారస్సహ మూలంవినశ్యతి. ౩౪

తే. గీ. ప్రత్యగాత్మస్వరూపంబు పరగనీకు
నెఱుగజెప్పెదవిను మదినెఱిగితేని
సకలదుఃఖాశయంబు సంసారమెల్ల
లీలనశియించిపోవు నిర్మూలముగను. ౩౧

శ్లో. యోఽస్మిక్ దేహేత్వహమహమితి ప్రత్యయాలంబనస్స
న్నాస్తేనిత్యంసకలకరణగ్రామ చేష్టానిదానం
సాక్షాజ్జానన్వివిధవికృతీః ప్రాణబుద్ధీంద్రియాణాం
సోఽయంప్రత్యజ్జహ మధిగత స్స్వాత్మనాశుద్ధబోధః. ౩౫

శ్లో. స్వయంత్వనిత్యా అపినిత్యతాంగతా
వ్యోమాదయోఽమీయదనుగ్రహేణ
యద్భానమాశ్రిత్య విభాంతినిత్యం
భానాదయః ప్రత్యగయంచిదాత్మా. ౩౬

సీ. ఈదేహముననేను నేననుమాటల
కాధారమై యింద్రియములచేష్ట
లన్నింటికినిహేతు వై ప్రాణబుద్ధీంద్రి
యములవికారంబు లఖిలములను

తానేయెఱుంగుచు నేనిత్యసద్రూపుఁ
డలరునాతఁడె ప్రత్యగాత్ముఁడనఁగ
తానేయహమ్మగాఁ గానసౌశుద్ధబో
ధాత్మకుఁడౌ సర్వసాక్షియితఁడె

తే. గీ. తామనిత్యంబులయ్యు నిత్యత్వమొంది
తోఁచువియదాదులీతని తోఁచునొంది
యీచిదాత్మునివెలుగున నెపుడువెలుగు
సోమసూర్యాగ్నిముఖ్యముల్ జ్యోతులెల్ల. 3౧

శ్లో. ప్రామాణ్యంవేదశాస్త్రాణాం త్వగ్ఘ్రాణశ్రుతిచక్షుషాం
ఘటతేయత్ప్రసాదేనసోఽయం ప్రత్యగశేషదృక్. 32

తే. గీ. వేదశాస్త్రంబులకుఁ జక్షురాదులకును
నెవ్వనియనుగ్రహంబున నెసగుచుండు
నిదియిదియటంచు ద్రఢిమతో నెఱుగుచుండు
శక్తి యదెప్రత్యగాత్ముండు సర్వసాక్షి. 33

శ్లో. యఇంద్రియార్థేంద్రియ సన్నిధాన
సంజాయమానాఖిలబుద్ధివృత్తీః
సాక్ష్యాత్మనాపశ్యతి నిర్వికార
స్సప్రత్యగర్థస్సదసద్విభిన్నః. 3౪

తే. గీ. ఇంద్రియములకు విషయంబు లెదురుపడిన।
యపుడు జనియించు బుద్ధివృత్త్యాకృతులను।

నిర్వికారైక సాక్షియై నిలిచిచూచు
వాఁడె సదసద్విభిన్నుండు ప్రత్యగాత్మ. 38

శ్లో. అచేతనా శ్చేతనతాం ప్రయాంతి
బుద్ధ్యాదయో యస్యమహాప్రసాదాత్
సర్వాంతర స్సర్వ విలక్షణోయ
స్తంప్రత్యగాత్మాన మవేహివిద్వన్. 39

తే. గీ. తెలివిలేని బుద్ధ్యాదు లేధీరుఁజేసి
యాభిముఖ్యంబునొందె సమస్తమెఱుగు
నట్టి యన్నింట నుండియు నంటకుండు
నతని గుఱుతింపుమా ప్రత్యగాత్ముఁడనుచు. 39

శ్లో. ఆవిర్భావతిరోభావస్థితయో యేనసర్వదా
బుద్ధ్యాదే రిహబుధ్యంతే సోఽయమాత్మేతిబుధ్యతాం. ४०

తే. గీ. ఎవ్వఁడెప్పుడును బుద్ధ్యాదు లిందుఁబొడము
టుండుటయు మాయుటయుఁ జూచుచుండు మఱపు
మాఱ్పులేకుండ నొకరీతి మలసినిలిచి
యతఁడె యీప్రత్యగాత్మగా నసఘు డెఱుఁగు. 3౬

శ్లో. చేతనత్వంచ బోద్ధృత్వం సర్వజ్ఞత్వంచ నిత్యతాం
అసదారోప్యహంకారో యస్యధర్మాన్ స్వయంభజన్ ४౧.
కరోతిపాప్రవృతం తత్త్వం ప్రత్యంచం విద్ధికేవలం. ४౧౻

తే. గీ. వినుమసత్తయ్యు నేనను వృత్తియెవని
ధర్మములఁ జేతనత్వ నిత్యత్వసర్వ
విత్త్వ బోద్ధృత్వములఁబూని తత్త్వమస్థ
పఱచునా కేవలాత్ముఁడే ప్రత్యగాత్మ. ౩౭

శ్లో. యోఽహంకారేణ పిహితో మేఘేనేవదివాకరః
నజ్ఞాయతే బుద్ధిహీనైర్వ్యాప్తోఽయమాత్మేతి బుధ్యతాం. ౪౨

తే. గీ. మబ్బుదినకరుఁ గప్పుమాడ్కి నెవఁడ
హమ్ముచేఁగప్పఁబడి తెలియంగఁబడను
బుద్ధిహీనులచే సట్టిశుద్ధబోధ
రూపునింబ్రత్యగాత్మగా రూఢినెఱుఁగు. ౩౮

శ్లో. స్వప్నప్రపంచో రవిణా నభాస్యతే
నైవానలాద్యైర్నచ చక్షురాదిభిః
ప్రత్యక్ప్రకాశేన విభాతిసర్వం
తస్మాత్స్వయంజ్యోతి రయంచిదాత్మా. ౪౩

తే. గీ. కలనుఁదోఁచిన వస్తు సంఘంబులర్క
వహ్నిచక్షుర్ముఖంబుల వలన వెలుఁగ
వవి వెలుంగొందు నీప్రత్యగాత్మదీప్తి
నగుటఁదనయంత వెలుఁగుఁ జిదాత్ముఁడితఁడు. ౩౯

శ్లో. బుద్ధిమాత్రేణ లిఙ్గేనాప్రత్యగేవ ఉపాధినా
స్పష్టవిభాతి విజ్ఞాతుంశక్యస్సద్భిర్ముముక్షుభిః. ౪౪

ఆ. వె. కలను బుద్ధి యొకటె వెలయు నీపరిత్యాగా
త్మున కుపాధియగుచు; బుద్ధిసేయు
గల్పనలనుఁజూచు ఘనుఁడని యాతనిఁ
దెలియనగు ముముక్షువులకుఁ గలను. ౮౦

శ్లో. బుద్ధ్యంశంభాస్యముత్సృజ్య భానమాత్రపరిగ్రహాత్
ఆత్మావశిష్యతే శుద్ధోబోధమాత్రోస్తి కేవలః. ౮౧

తే. గీ. తోఁచునది బుద్ధియంశ మాతోఁపువిడిచి
చూపుమాత్రము గొనుటచే శుద్ధబోధ
మాత్రుఁడగు పరిత్యాగాత్మ నిర్మలుఁడుమిగులు
నదియెఱుంగుటె నీవపియగుటసుమ్ము. ౮౨

శ్లో. భక్ష్యస్థం యత్తుమాధుర్యం కేవలం సైవశర్కరా
అవశిష్టంతు యద్ద్రవ్యంతత్పిష్టం నతుశర్కరా. ౮౩

శ్లో. తద్వదత్రతు యద్భానం శుద్ధం స పరిత్యాగివ్యతే
యత్తుభాస్యంసబుద్ధ్యంశో నత్వాత్మాఽయంస్వయంప్రభః. ౮౪

చ. అతిరసమందుఁ దీపనెడు నంశము చక్కెర; యట్టిదాని ని
గ్గలి మొనరింపగామిగులు ద్రవ్యము చక్కెరగాదు పిండియే
మతిఁగనుశుద్ధమౌవెలుఁగుమాత్రముచూపగుపరిత్యాగాత్మభా
సితమదియెల్లబుద్ధికళ చిన్మయుఁడాత్ముఁడుగా దెఱుంగుమా.

శ్లో. ఉపాధివిరమే సుప్తౌ బోధమాత్రావశేషతః
స్వయ మానందరూపేణ పరిత్యాగేవ ప్రకాశతే. ౮౫

ఆ. వె. నిదుర నీయుపాధి నిలిచిలీనంబైన
మిగులు బోధమాత్రమే; తనంత
నపుడు ప్రత్యగాత్మ యానందరూపుఁడై
వెలుగుచుండుననుచుఁ దెలియుమయ్య. ౪౩

శ్లో. సుషుప్తిసాక్షిణం శుద్ధం చిదేకరస మవ్యయం
తం నిర్విశేషమాత్మానం సోఽహామిత్యేవ నిశ్చిను. ౪౯

ఆ. వె. అట్టిసుప్తిసాక్షి యమలుండు చిన్మయా
ఖండరసమయుండు ఘనుఁడు నిర్వి
శేషుఁడవ్యయుండు సిద్ధుఁడౌ నాత్మ;నే
నతఁడెయంచు నిశ్చయంబునొందు. ౪౪

శ్లో. శరీరమేవస్వాత్మానం పశ్యతీతి పశుర్మతః
తద్దర్శీ చే త్పండితోఽపి తస్యాప్యస్యకిమంతరం. ౫౦

తే. గీ. తనువెతానంచుఁజూచు నాతండు పశువు
పండితుండు నట్లెచూచుచు నుండెనేని
వానికిని వీనికిని నించుకేని భేద
మగునె? యట్లౌట విడువుదేహాత్మదృష్టి. ౪౫

శ్లో. స్తోత్రస్యాపిచ నిందాయాః పాత్రంమలమయంవపుః
తయోర్న విషయస్స్వాత్మా నిర్వికారో నిరాకృతిః. ౫౧

తే. గీ. స్తోత్రమునకును నెంతటి దూషణకును
పాత్ర మీ మలమయమగు గాత్రమెయగు;

నే వికారము నాకారమేని లేని
యాత్మ నిందకు స్తుతికి నర్హంబుగాదు. ౪౬

శ్లో. మాంసాస్థిమజ్జామలమూత్రపాత్రే
గాత్రే స్వ మాత్మత్వమతిం జహీహి
విలక్షణం స్వం విమలం ప్రశాంతం
చిన్మాత్ర మానందఘనం విదిత్వా. ౫౨

తే. గీ. మాంసమెముకలు చీమును మలము మూత్ర
ముం మసీమేని నేననకుండుమీవు
జ్ఞప్తిరూపుండ వానందఘనుఁడ వధిక
శాంతుఁడవు నిర్మలుండవు సాక్షివగుట. ౪౭

శ్లో. యదేకస్మి న్ననేకత్వకల్పనా కారణం పరం
తదజ్ఞానం విజానీహి కారణం వపు రాత్మనః. ౫౩
అనేన వపుషా చ్ఛన్నః పరిత్యగాత్మా స్వయంప్రభః
అసంసార్యపి సంసారవదేవాభా త్యవిక్రియః. ౫౪

చ. వినుమొకదానఁజెక్కులుగ విశ్వముఁ గల్పనసేయమూలమౌఁ
దనునెఱుగంగలేమి; యదెదట్టవు కారణదేహమాత్మ; కీ
తనువు మునుంగునంబమటుఁ దానెవెలింగెను పరిత్యగాత్మ ని
ర్గుణుఁడజుఁడయ్యుసంసృతినిఁ గూడినవాఁడుగదోచుఁజూడగన్.

శ్లో. కార్యకారణసంఘాతకార్యం కర్మ నచాత్మనః
తదజ్ఞాత్వా విమూఢాత్మా కర్తాహమితిమన్యతే. ౫౫

ఆ. వె. కర్మమునకుఁ గర్త కార్యకారణగణం
బగుననాత్మగాని యాత్మగాదు
తెలివిలేనివాఁడు దీనినెఱుంగక
తానుగర్తయనుచుఁ దలచుచుండు. ౪౯

శ్లో. అన్యనిష్పాదితేకర్మణ్యయం మూఢమతిర్జనః
కర్తృత్వాభినివేశేన సంసారాబ్ధౌ నిమజ్జతి. ౫౬

తే. గీ. మఱియొకటిసేయుచుండు గర్మంబు జనుఁడు
తానెచేయుచునున్నట్లు తలచి చిక్కి
వివిధదుఃఖమహాగ్రాహ భీష్మమైన
ఘోరసంసారజలధి మగ్నుఁడగుచుండు. ౫౦

శ్లో. యోవాఽనాత్మకృతంకర్మ పశ్యత్యాత్మన్యవిక్రియే
సఏవాజ్ఞతమోలోకే నగోపో నాపిబాలకః. ౫౭

ఆ. వె. ఎవఁడనాత్మసేయు సీకర్మమును నిర్వి
కారుఁడాత్మసేయు కరణినెంచు
వాఁడెలోకమందుఁ బరమమూఢాత్ముండు
బాలకుఁడును గొల్లవాఁడుఁగాఁడు. ౫౧

శ్లో. దేహేంద్రియప్రాణమనోఽహమాదిభి
స్స్వనాత్మకై రాత్మనికల్పితైః కృతం
అవిక్రియేస్వాత్మనిశుద్ధబోధే
త్వారోప్యయశ్శోచతిమూఢఏవసః. ౫౮

సీ. ఆశ్చర్యము:గ నాత్మయందుఁగల్పితములౌ
దేహేంద్రియములు మనోఽహములును
ప్రాణముల్మొదలౌ ననాత్మకములుసేయుఁ
గర్మంబులెల్ల వికారరహితుఁ
డమలబోధాత్మకుం డగుస్వాత్మచేసిన
యవిగాఁదలంచుచు నందువలనఁ
గలుగుబంధమునకై కనుదుఃఖపడుచుండు
నతనికంటెనుమూఢుఁ డవనిలేడు
తే. గీ. ప్రాఁతఁదోఁచినయట్టి సర్వంబుసేయు
భయదకర్మమ్ము మ్రాఁకదే? భ్రాంతుఁడట్లు
తలచిన తెఱంగె సుమ్మనాత్మకముసేఁత
లాత్మసేఁతలుగానెంచి యార్తిఁబడుట. ౧౭

శ్లో. స్వప్నే యథానిర్విషయేఽపిసంసృతిం
సూతేమనస్స్వస్థితవాసనాబలాత్
తథైవ జాగ్రత్యపి పూరుషస్య
సర్వంమనః కల్పయతే స్వశక్త్యా. ౧౮

తే. గీ. మనసు దనయందునున్న వాసనలబలిమి
నిర్విషయమైన కలలో జనింపఁజేయు
బురుషునసంసార; మట్లె జాగరమునందు
మనసెతనశక్తి నఖిల నూతనిక మర్చుఁ. ౧౯

శ్లో. మనఏవాఖిలంవిశ్వం సృజత్యత్రతథావిధిః
స్వప్నవన్నహిస్వప్నస్థో బ్రహ్మణాసృష్టఉచ్యతే. ౨౦

తే. గీ. ఈజగమునెల్లఁ గలవలె నీవుచూచు
నది మనసెకాని బ్రహ్మగా దరసిచూడు
స్వప్నమునఁ జూచినట్టియేవస్తువైన
బ్రహ్మనిర్మితమై చూడఁబడునె పుత్ర? ౫౪

శ్లో. రూపంనామంచజాతించ కల్పయిత్వాస్వశక్తితః
బ్రహ్మజ్ఞమపివా చిత్తం సంసారయతి పూరుషం. ౬౧

తే. గీ. నామరూపజాతులనెల్ల నీమనస్సె
మించుతనశక్తిచేతఁ గల్పించి పురుషు
నెట్టిబ్రహ్మజ్ఞునైన సంసృతినిదించి
త్రిప్పలనుఁబెట్టుచుండు సందియములేదు. ౫౫

శ్లో. సంసారో మనసా పుంసః కల్పితోఽస్తి నవస్తుతః
మనశ్శూన్యస్యసుషుప్త్యాదౌ సంసారోనైవదృశ్యతే. ౬౨

క. పురుషునిసంసృతి మనమునఁ
బరికల్పిత మంతెకాని వాస్తవముగలే
దరయుము మనసుండని ని
ద్దురమొదలగుపట్ల నుండదుర సంసృతియున్. ౫౬

శ్లో. యత్రయత్ర మనస్స్ఫూర్తి స్తత్రతత్ర జగత్త్రయం
యత్రయత్ర మనోనాస్తి తత్రతత్ర నకించన. ౬౩

క. ఎందెందుఁగలదొ మానస
మందందె జగత్త్రయంబు నడరు వివిధమై

యెందెందులేదో మానస
మందందేమియునునుండ దరయుమువత్సా. ౫౭

శ్లో॥ అహోబ్రహ్మమయీదృష్టిః పీయూషాంబుదవత్సదా
ఆనందమేవ సర్వత్ర ప్రవర్షతి నిరంతరం. ౬౪

తే. గీ. సృష్టియని బ్రహ్మభిన్నమొక్కింతలేదు
బ్రహ్మమిదియెల్లనను ననుభవమయారె!
యమృతమేఘంబు పగిది నెల్లపుడుఁ గురియు
విమవకానందమే యెందు వెల్లివిరియ. ౫౮

శ్లో. సర్వానర్థనిదానం మనఏవభవత్యముష్య పురుషస్య
తన్మనసోనిగ్రహణం కర్తవ్యం బంధముక్తయే పుంసాం. ౬౫

తే. గీ. పురుషున కనర్థములకెల్లఁ బుట్టినిల్లు
మనసె; కావున సంసారమనెడు కట్టుఁ
ద్రెంపఁబూనిన వెస నిగ్రహింపవలయు
మనసెయెప్పుడుఁ దనయంతఁ జనకయుండ ౫౯

శ్లో. సంకల్పోపి వికల్పః కామః క్రోధోభయం విషాదశ్చ
మనసోహ్యేతే ధర్మానైవద్రష్టుశ్చిదాత్మనః కోపి. ౬౬

క. విను సంకల్పవికల్పము
లునుఁ గామక్రోధములును లోభభయములున్
మనసునఁ గలిగెడు ధర్మము
లొనరవు ద్రష్టయగుఁ జిన్మయున కివి యెవియున్. ౬౦

శ్లో. జ్ఞానక్రియాశక్తిమదంతరంగం
విజ్ఞానసంజ్ఞం ప్రథమం వికారం
అనాదిసాంసారిక వాసనాఢ్యం
గుణప్రసాదాస్పద మాత్మలింగం. ౬౭

శ్లో. ఇదం చిదాత్మస్ఫురణానువృత్త్యా
విస్ఫూర్తి మత్యంత ముపైతి సన్నిధౌ
చిదాత్మన స్తుల్యతయా విభాతి
సూర్యస్య దీప్త్యా స్ఫటికో యథా తథా. ౬౮

సీ. జ్ఞానశక్తిక్రియాశక్తులుగలయంత
రంగంబు విజ్ఞానమనెడిపేర
నమరునాదిమవికార; మనాదిసాంసారి
కానేకవాసనాఢ్యంబు; మఱియు
గుణములుమూఁడునుఁ గుదిరియుండెడిచోఁడ;
యాత్మనుగుఱుతింప నైననెలవు;
లింగదేహమిదే వెలుంగుఁ జిదాత్మని
దీప్తిత్తోఁడుగఁ దానుఁదేజరిలుచు.
తే. గీ. దీనికత్యధికంబగు దీప్తిగలిగి
యాత్మపోలిక వెలుఁగుటయయ్యొసుమ్ము
స్వప్రకాశాత్మ సన్నిధాన ప్రభావ
ముననె; రవిదీప్తిస్ఫటికంబు దనరునట్లు. ౬౯

శ్లో. అయం మహా నహంకారో వృత్తిమాన్ కర్తృలక్షణః
సర్వసంసారనిర్వోఢా విజ్ఞానమయశబ్దభాక్. ౭౦

శ్లో. అహంమమేత్యేష సదాభిమానం కరోతిదేహేచతదీయధర్మే
జీవాభిధాసఃపురుషోఽయమేవకర్తాచ భోక్తాచసుఖీచదుఃఖీ.౨౦

శ్లో. పుణ్యంచ పాపంచకరోతి తత్ఫలం
భుక్తేస్వయంనందతి ఖిద్యతేచ
సత్త్వాదిధర్మస్ఫురణేన జాగ్ర
త్స్వప్నాద్యవస్థా అయమేవయాతి. ౨౧

సీ. విజ్ఞానమయమనుపేర నీబల్లిదం
బౌనహంకారమే తానుగర్త
నని సర్వసంసారమును నిర్వహించుచు
వృత్తులనెల్ల భరించుచుండు
దేహంబునేనని దేహధర్మంబులు
నాయవియని తలపోయునిదియె
ధరజీవుఁడనబడు పురుషుండిదే కర్త
భోక్తయు దుఃఖియు భోగి యిదియె.
తే. గీ. పాపపుణ్యంబులొనరించి ఫలమునొంది
యిదియెకుందును సంతోషమిదియెపొందుఁ
దానెసత్త్వరజస్తమో ధర్మములను
పొంది మెలఁకువఁ గల నిద్ర నొందుచుండు. ౬౨

శ్లో. విజ్ఞానకోశోఽయమతీవశుద్ధ
స్సత్త్వప్రధాన శ్చితిసన్నిధానాత్
చైతన్య మేత్యాత్మవదేవ భాతి
వ్యాయోయథా వహ్నిరివాగ్నితప్తం. ౨౨

తే. గీ. శుద్ధతరమును సత్త్వసంశోభితంబు
నైన విజ్ఞానకోశమీయది చిదాత్మ
నొద్దనుండుటఁ జైతన్య మొంది తప్త
మైనయినుమగ్నినట్లు తానాత్మఁబోలు. ౬౩

శ్లో. చిద్దీప్తోఽయమహంకారో వ్యాపాదతలమస్తకం
దేహంవ్యాప్నోతి తేనైష దేహోఽభవతి చేతనః. ౨౩

తే. తే. ప్రత్యగాత్మప్రకాశంబుఁ బడసి యీయ
హమ్మె యఱకాలుమొదలు శీర్షాంతముగను
దేహమంతయు వ్యాపించు; దీనివలన
దేహమిది చేతనంబయి తేజరిల్లు. ౬౪

శ్లో. అతఏవాత్మసాదృశ్యాత్తేషామత్రాత్మతామతిః
అనాత్మన్యయసః పిండే వహ్నిబుద్ధిర్యథాతథా. ౨౪

తే. గీ. ఎఱ్ఱగాఁగాలియుండెడు నినుపముద్ద
నిప్పువలెనుంట నదిగని నిప్పటంచు
నెంచుతీరున నాత్మసాదృశ్యమొంది
కనఁబడ ననాత్మ నాత్మగాఁగంద్రు జనులు. ౬౫

శ్లో. అహంకారమహఁజానే విముక్తిప్రతిబంధకం
ఇతిజానాత్యహంకార మాత్మాఽహంపదలక్షణః. ౨౫

తే. గీ. ఏనెఱుంగుదు నీయహంకృతిని; ముక్తి
గలుగనీయదు నాకిది వెలయననుచు

సహాముసెఱుఁగుచు నేను నేనంచు నాత్మ
యలరుఁగావున నీయహమ్మాత్మగాదు. ౬౬

శ్లో. తతోజ్ఞాతా భవత్యాత్మా౽హంపదార్థోవిలక్షణః
జ్ఞేయోభవత్యహంకారో౽న్యస్య విజ్ఞాతు రాత్మనః. ౭౬

తే. గీ. నేననెడు మాటకర్థమై నిలిచిచూచు
నాత్మఁ దెలిసెడువాఁడౌట సహాము తన్ను
నెఱుఁగు మఱియొక్కఁడగునాత్మ కెఱుఁగఁబడెడు
నదియగునుగాని యాత్మగా దరసిచూడు. ౬౭

శ్లో. జ్ఞేయోజ్ఞాతాసభవతి యుక్తినాంశతకోటిభిః
యత స్తతో౽హంశబ్దార్థ ఆత్మైవేత్యవసీయతాం. ౭౭

తే. గీ. యుక్తులొకనూఱుకోట్ల నెట్లొఁజసిచూచి
నను నెఱుఁగువాఁడు గా డెఱుంగనగునెదియు
నట్లగుట నేననెడుమాట కర్థమగుచు
నెఱుఁగువాఁ డాత్మయే యని యెఱుఁగవలయు. ౬౮

శ్లో. అహంపదార్థో౽యమఖండబోధో
జ్ఞాతాహమాదే రఖిలస్య వస్తునః
సుప్త్యాద్యవస్థాత్రితయస్యసాక్షీ
చాకాశవత్సర్వగతశ్చనిత్యః. ౭౮

ఉ. ఏననుమాట కర్థమగు నీతఁడు శుద్ధ చిదాత్మకుం; డితం
డేనను వృత్తి మున్నగునవెల్ల నెఱుంగుచునుండు; సుప్తిము

నైనయవస్థలన్నిటికి సాక్షియితండె; యితండె నిత్యుఁడై
పూనికసర్వ మాకసముపోలిక నిండి వెలుంగునెప్పుడున్. ౯

శ్లో. అయంసదాంతర్బహిరేకరూప
శ్చైతన్యమాత్రో నిబిడో నిరంశః
అంతర్బహిస్సైంధవఖిల్యవక
రసోయథాతద్వదయంచిదాత్మా. ౧౯

తే. గీ. లోనవెలుపల నుప్పుగల్లువలె నేక
రసమయుండయి విభజింపరాక బయట
లోన నిండిన యొక్కరూపైన చిత్తు
తానయివెలుంగుచుండు సంతతము నితండె. ౧౦

శ్లో. శుద్ధాత్మనిచిన్మాత్రే కూటస్థేప్రత్యగాత్మనిభ్రాంత్యా
కల్పితమిహజీవత్వం సన్నిధితోహ్యహంకారస్య. ౨౦

శ్లో జపాకుసుమసాన్నిధ్యా ద్రక్తత్వంస్ఫటికేయథా
తథాఽహంకారసాన్నిధ్యా జ్జీవత్వంప్రత్యగాత్మని. ౨౧

చ. స్ఫటికముపజ్జఁ జేరిన జపాకుసుమంబునఁ గల్గురక్తిమన్
స్ఫటికము కెంపుదాయిగను భ్రాంతిఁగనంబడినట్లుసాక్షియున్
స్ఫుటతర బోధరూపుడయి శుద్ధతవెల్గెడుఁ బ్రత్యగాత్ముచెం
గట నహముంటనాతనికిఁ గల్పితమయ్యెను జీవభావమున్. ౧౧

శ్లో. యదన్యథాభావహేతు రతథాభూతవస్తునః
తదజ్ఞానం తమోరూపం సంసారాదిమకారణం. ౨౨

క. ఒకరీతివస్తువునువే
ఱొకరీతిగఁదోఁప జేయుచుండుతమోరూ
పకమేసంసృతిమొదలిటి
వికారం; మజ్ఞానమంద్రు విజ్ఞులుదీనిన్ ౨౨

శ్లో. అజ్ఞానదోషేణతు యత్రయత్రప్రకల్పితంతత్తుమృషైవదృష్టం
రజ్జ్వాదికే వస్తుని సర్పతాది యథా తథైవాత్మనిజీవతామృషా.

తే. గీ. వసుధ నెందెందు నజ్ఞానవశత నెద్ది
యెద్ది కల్పితమగు నదియెల్లఁ గల్ల;
యగుటరజ్జ్వాదులందు సర్పాదికల్పి
తములవలె నాత్మకగు జీవతయుఁగల్ల. ౨౩

శ్లో. నిరంజనే నిర్వికారే నిష్క్రియేఽసంగవస్తుని
సాక్షిణ్యారోపితం సర్వం స్వప్నవత్సర్వదామృషా. ౧౪

తే. గీ. నిర్మలుఁడు నిర్వికారుండు నిష్క్రియుండ
సంగుఁడగు వస్తువైన యీసాక్షియందుఁ
గల్పితము సర్వమును వట్టికలయవోలె
కల్లయగుఁగాని సత్యంబుగాదుచూడ. ౨౪

శ్లో. నహిస్వాప్నిక సంసారః కర్తృభోక్తృత్వ లక్షణః
సత్యస్సమీక్ష్యతే తద్వజ్జాగ్రత్కాలేపి సాక్షిణః. ౧౫

తే. గీ. చేయుచున్నాఁడ ననుభవించెదననేన
టంచుఁ గలలోనఁదోఁచెడు నఖిలమైన

సంసృతి నిజంబుగా; దల్లిజాగరమున
సాక్షికగపడు జగము నిజంబుగాదు. ౨౫

శ్లో. తస్మాదవిద్యా తత్కార్య సంబంధ రహితస్సదా
శుద్ధఏవభవత్యాత్మా నిష్కలోనిష్క్రియస్స్వయం. ౨౬

తే. గీ. కావున నవిద్యకును దానికార్యములకుఁ
దనకు సంబంధమేమియుఁ దనరకుండు
నాత్మ యెపుడును శుద్ధుండు నక్రియుఁడు ని
రంశకుండౌట సుప్రసిద్ధార్థమనఘ. ౨౬

శ్లో. తతఏవశ్రుతిర్వక్తి బ్రహ్మాభిన్నత్వమాత్మనః
సాక్షాత్తత్త్వమసీత్యేవ భూయోభూయః పునఃపునః. ౨౭

తే. గీ. ఆత్మబ్రహ్మంబె వేఱుగాదనుచునందు
వలననే తత్త్వమసి యనువాక్యమందు
వేదమాతయుఁ బలుమాఱు నూఁదియూఁది
చెప్పుచున్నది యాదరం బొప్పమనకు. ౨౭

శ్లో. యత్కార్యంయత్తు తన్మాత్రమేవవిద్ధివిలోకితం
మృద్ఘటాదౌ తతస్సర్వం బ్రహ్మమాత్రమిదంజగత్. ౨౮

క. ఎదిదేని కార్యమగున
య్యదితన్మాత్రంబె; మృద్ఘటాదులఁగననౌ
నిది; యట్లె బ్రహ్మమాత్రమె
కదయీజగమెల్ల బ్రహ్మకార్యంబగుటన్. ౨౮

శ్లో. జగతో బ్రహ్మమాత్రత్వే పరస్య బ్రహ్మణ స్సదా
అద్వయత్వం స్వతస్సిద్ధం ద్వైతహేతో రసంభవాత్. ౮౯

ఆ. వె. జగము బ్రహ్మమాత్రమగుట బ్రహ్మంబున
కద్వయత్వసిద్ధి యగుఁదనంత
నెప్పుడేని ద్వైతహేతువులేమి బ్ర
హ్మంబు నిర్వికల్పమగుట నిజము. ౮౯

శ్లో. నేదం చోద్యం మయాత త్త్వం కథ్యతే శృణుసాదరం
బీజా దంకురవ త్తాతాత్పుత్రవ ద్బ్రహ్మణో జగత్. ౯౦

శ్లో. నేదంజాతమితిబ్రూమో వయమద్వైతవాదినః
కింతుబ్రూమో జగత్సర్వం వివర్తం బ్రహ్మణ స్త్వితి. ౯౧

శ్లో. మరురేవాంబురూపేణ యథైవాభా త్యవిక్రియః
రజ్జురేవాహిరూపేణ యథాభా త్యవికారిణీ. ౯౨
తథైవ జగదాకృత్యా బ్రహ్మైవాభా త్యవిక్రియం. ౯౪

సీ. ఇదినేను గల్పించినదిగాదు; వినుతత్త్వ
మెఱిగింతు నాదరంబినుమడింప
విత్తనంబునుండి వృక్షంబు పోలికఁ
తండ్రియందుండి నందనునిపగిదిఁ
బుట్టెనీజగమని యెట్టునుఁ జెప్పమే
మద్వైత వాదులమగుట; నింక
నేమనఁజెప్పెద మిదివినుమెండమా
వులెజలంబుగఁ దాడెచిలువఁబోలె.

తే. గీ. నేవికారంబు లేక తా నెట్లు తోఁచు
నట్లె బ్రహ్మంబవిక్రియంబయ్యుఁ దోఁచు
జగము పోలికఁ; గాన నీ జగము బ్రహ్మ
మున వివర్తంబు; శ్రుతి కిది యనుమతంబు. ౨౦

శ్లో॥ అపశ్యతా మధిష్ఠానం విశ్వం భాతి యథార్థవత్
అదృష్ట మరుదేశానాం మరీచిసలిలం యథా. ౯౩

తే. గీ. నిర్జలస్థల మెఱుఁగకుండిన జనులకు
నొడమావుల సలిలప్రకాండ మట్లు
జగదధిష్ఠాన మెఱుఁగని జనుల కెల్ల
సత్యముగ నున్నయట్లు విశ్వంబు దోఁచు. ౨౧

శ్లో॥ విజ్ఞాతేస త్యధిష్ఠానే పరే బ్రహ్మణి కేవలే
ప్రతీతమఖిలం విశ్వం బ్రహ్మమాత్రం భవేత్స్వయం. ౯౪

తే. గీ. జగదధిష్ఠానమని యీ యసంగమైన
బ్రహ్మ మెఱిఁగిన నటఁ గానవచ్చుచున్న
విశ్వమిది యెల్లఁ దనయంత వెలయు బ్రహ్మ
మాత్రమగుఁ; దోఁచదన్య మేమాత్రమైన. ౨౨

శ్లో. మరౌదృష్టస్య తోయస్య మరుజ్ఞానే సముత్థితే
యథాస్యా న్మరుమాత్రత్వం తత్రైవ జగతోఽస్యచ. ౯౫
బ్రహ్మమాత్రత్వమేవ స్యాత్ జ్ఞాతే బ్రహ్మణిసాశ్రయే. ౯౬

క- మరుభూమి నెఱిఁగినప్పుడు
మరుభూమిం దోఁచునీరు మరుమాత్రంబౌ

కరణిని జగదాశ్రయమగుఁ
బరమాత్మనెఱుంగ జగము బ్రహ్మంబెయగుఁ. ౮౩

శ్లో. ఆరోపితస్యాధిష్ఠానా కారేణావస్థితింవినా
విలయో నిర్గమోవాపి సతిబాధే నదృశ్యతే. ౯౬

తే. గీ. భ్రమకు నాశ్రయమగుదానిఁ బరగనెఱుఁగ
బాధనొందెను కల్పితవ్యక్తి దనకు
నాశ్రయంబగుదాని రూపగునెగాని
చెడను మఱియెందులకునేఁ వెడలిచనదు. ౮౪

శ్లో. అధిష్ఠానాత్పృథగ్భావమాత్రమేవ యతోజగత్
తతోఽధిష్ఠాన మాత్రత్వం జగతో నవిరుధ్యతే. ౯౭

తే. గీ. కానజగమన జగదధిష్ఠానభిన్న
భావమాత్రంబె; యట్లాట బాధనొంద
దది యధిష్ఠానమాత్రమే యన్నయవును;
రజ్జుసర్పంబు రజ్జుమాత్రంబెకాదె? ౮౫

శ్లో. నైతావన్మాత్రతో బ్రహ్మజడం భవితుమర్హతి
నదృశ్యంవా స్యనిత్యంచ నచ సావయవంతథా. ౯౮

శ్లో. స్వస్మిన్ కల్పితతోయస్య స్వమాత్రత్వేతు కిం మరోః
శీతతా ద్రవతావాపి జలధర్మో విలోక్యతే? ౯౯

శ్లో. జాడ్యాదిధర్మకం విశ్వం స్వరూపేణాస్తిచేత్తదా
తద్వైశిష్ట్యేతు దోషాస్స్యుర్బ్రహ్మణో జడతాదయః. ౧౦౦

శ్లో. ఆభాతస్య క్వ స్వరూపం ఘటతే మరుతోయవత్
నహ్యత్రేవీక్ష్యతే లోకే స్వరూపం మరువారిణః. ౧౦౧

సీ. ఇంతమాత్రంబునసే బ్రహ్మముజడంబు
దృశ్యం బనిత్యంబు నేనిఁగాదు
కాదుసావయవంబుఁ గల్పితతోయంబు
మరుమాత్రమైన నామరువునందు
జలధర్మమైన శీతలతయేని ద్రవత్వ
మేనియుఁ గనఁబడునే నిజముగ ?
జాతిగుణక్రియాశ్రయమైన జగమస్లు
తనరూపులోనున్నఁ దగులవచ్చు

తే. గీ. నవుడు తద్వ్యక్తమైన బ్రహ్మంబునకును
జడతమున్నగుదోషముల్; దడవిచూడఁ
గల్పితమునకు నొకరూపుగలదె ? మరుజ
లంబులెవఁడైనఁ గనియున్నె యంబువులుగ ? ౮౬

శ్లో. గ్రహీతుర్గ్రహదోషేణ బ్రహ్మైవజగదాత్మనా
ఆభాతం సర్పవద్రజ్జు ర్యథాతద్వదవిక్రియం. ౧౦౨

ఆ. వె. తెలియువానితెలివిఁ గలుగుదోషంబున
త్రాడుపాముఁబోలె బ్రహ్మమదియె
యేవికారమొవుడు నేమియులేనిది
కానవచ్చుజగము శరణినిల్లు. ౮౭

శ్లో. ఆభాతస్య హ్యధిష్ఠానా దన్యత్వంనై వసిద్ధ్యతి
అధిష్ఠానాత్పృథక్సత్తా రజ్జుసర్పే నవీక్ష్యతే. ౧౦౩

తే. గీ. భ్రమమునఁదోఁచినయది భ్రమాశ్రయముగాక
వేఱెయగు టెప్పుడును సంభవింపదరయ
రజ్జుసర్పంబు దానియాశ్రయమెకాక
పాముగానుండఁ జూచినవారు గలరె? ౮౮

శ్లో. పరస్మాద్బ్రహ్మణోవిశ్వం కదాచిన్నైవభిద్యతే
రజ్జుసర్పోయథా రజ్జోస్స్వరూపేణనభిద్యతే. ౧౦౪

తే. గీ. రజ్జువునకన్న రజ్జుసర్పంబు సర్వ
రూపమున వేఱె యెప్పుడును దోఁపనిక్రియ
విశ్వమిది బ్రహ్మమునకన్న వేఱె వస్తు
రూపమునలే దెఱుంగు మారూఢి దీని. ౮౯

శ్లో. నభిద్యతేయథాదంతీ స్వస్వరూపేణదారుణః
స్వరూపేణతథావిశ్వం బ్రహ్మణోనైవ భిద్యతే. ౧౦౫

తే. గీ. కొయ్యకన్నను నేనుఁగొక్కండు వేఱె
స్వస్వరూపంబుతో లేనివగిది నరయ
విశ్వమిది బ్రహ్మమునకన్న వేఱె వస్తు
రూపమున లేదెఱుంగు మారూఢి దీని. ౯౦

శ్లో. యతఏవం తతోవిశ్వం సర్వంబ్రహ్మైవకేవలం
విచార్యమాణే సమ్యక్తు శ్రుతిస్మృత్యుపపత్తిభిః. ౧౦౬

తే. గీ. అట్లగుట మంచియుక్తిచే నాగమాది
శాస్త్రసిద్ధప్రమాణసంచయమువలనఁ
దఱచిచూచిన విశ్వమంతయును బ్రహ్మ
మాత్రమేయగు వేఱొండు మాటలేదు. ౯౧

శ్లో. విశ్వం బ్రహ్మాభిన్నమేవ స్వయంభవితు మర్హతి
అధిష్ఠానానతిరిక్తస్వరూపత్వా ద్గుణాహివత్. ౧౦౭

తే. గీ. విశ్వమిది బ్రహ్మమునకన్న వేఱుగాక
యుండుటెఱుగు నెట్లన్న నుండునట్టి
వస్తువునకన్నఁ గల్పితవస్తు వన్య
మై నిలువ దెందు రజ్జుమహాహియట్లు. ౯౨

శ్లో. ఇదం బ్రహ్మవివర్తత్వా ద్బ్రహ్మాభిన్నం జగత్సదా
మృద్వివర్త స్స్వయం కుంభో మృదభిన్నో యథాతథా. ౧౦౮

ఆ. వె. అరయ మృద్వివర్తమగు ఘటంబు తనంత
వేఱె మృత్తుగాక వెలయనిక్రియ
జగము బ్రహ్మాభిన్నముగ నెప్పుడునులేదు
బ్రహ్మమునకు నది వివర్తమగుట. ౯౩

శ్లో. బ్రహ్మాభిన్నం స్వతస్సత్తారహితత్వా దిదంజగత్
శుక్తిరూప్యవ దిత్యాద్యా జయంతి బహుయుక్తయః. ౧౦౯

క. తనయంత నునికిలేనిది
గనుక జగములేదు పరముకన్నను వేఱై;

విన శుక్తిరూప్యము న్వలె
ననుమున్నగు యుక్తు లిది యథార్థముసేయుఁ. ౯౪

శ్లో. విశ్వస్య బ్రహ్మాభిన్నత్వే శ్రుతయోఽపిచ జాగ్రతి
'ఐతదాత్మ్యమిదంసర్వం' 'సఇదంసర్వ' మిత్యపి. ౧౧౦

శ్లో. 'చిద్ధీదం సర్వ' మిత్యేవ 'సర్వంఖల్విద' మిత్యసౌ
'బ్రహ్మైవేదం' 'విశ్వమిద' మిత్యాద్యా స్తత్ప్రయోజనాః.

శ్లో. 'వాసుదేవ స్సర్వమిదం' 'సర్వం విష్ణుమయం జగత్'
'బ్రహ్మమాత్ర మిదం సర్వం' 'బ్రహ్మైవ సకలం జగత్'.

శ్లో. 'భూతాని విష్ణు' రిత్యాద్యా శ్శతశోఽథసహస్రశః
విశ్వస్య బ్రహ్మాభిన్నత్వే జయంతి స్మృతయోఽపిచ. ౧౧౩

సీ. జగము బ్రహ్మాభిన్న మగునను టకుఁ బ్రమా
ణములగు వేదవాక్యములు వినుము
తగ నైతదాత్మ్యమిదంసర్వ మరియు స
ర్వంఖల్విదమ్మని పలుకునదియు
నరయ బ్రహ్మైవేదమని విశ్వమిదమని
విను సఇదంసర్వ మనునదియును
చిద్ధీదమనిసర్వ స్పష్టలక్షణోక్తితోఁ
నిట్టివెన్నేనిఁ జూపట్టఁగలవు.

తే. గీ. స్మృతులు నను వాసుదేవుఁడిదెల్లననుచు
నఖిలజగమును విష్ణుమయంబటంచు

బ్రహ్మమాత్రమిదెల్లను బ్రహ్మమే జ
గంబు సర్వంబు వారియె భూతంబులనుచు. ౯౫

శ్లో. బ్రహ్మాత్మనా జగద్భాతి శుద్ధబుద్ధే ర్మహాత్మనః
బ్రహ్మైవ జగదాకృత్యా భాత్యశుద్ధధియోఽసతః. ౧౧౪

తే. గీ. అమలమగు బుద్ధిగల్గు మహాత్మునకు జ
గంబు వెల్గొందుచుండు బ్రహ్మంబెయగుచుఁ;
గలుషమతియగు జనునకుఁ గానవచ్చు
బ్రహ్మమే జగదాకృతిఁ బరగునట్లు. ౯౬

శ్లో. అంతర్దృష్టేః స్వయం భాతి హేమాకృత్యైవ కుండలం
హేమైవ కుండలాకృత్యా బహిర్దృష్టేః ప్రతీయతే. ౧౧

క. కనఁబడునంతర్దృష్టిం
గనువానికిఁ గుండలంబు కనకాకృతితోఁ
గనఁబడును బహిర్దృష్టిం
గనువానికిఁ గుండలంబుగాఁ గనకంబే. ౯౭

శ్లో. అహ్న్యంధదృష్టేః సర్వత్ర తమఏవ ప్రతీయతే
చక్షుష్మత స్తేజఏవ యథా తద్వ దసన్మతేః. ౧౧౬

శ్లో. బహిరంతశ్చ సర్వత్ర విశ్వమేవ ప్రతీయతే
శుద్ధాత్మనో బ్రహ్మవిదో బ్రహ్మైవ సమదర్శినః. ౧౧౭

చ. కనఁబడుఁ జీకటే పగలు గన్నులు గానని వాని కెందునుం
గనఁబడు వెల్తురే కనులుగల్గినవానికి; నట్లె మూఢచి

త్తున కెటుఁజూచినన్ జగమెల్లోచుచునుండును లోనవెల్పలన్
దనరును బ్రహ్మమే సుమతి తజ్జ్ఞుఁడునౌ సమదర్శికెందునున్.

శ్లో. సదేవ విశ్వం విపరీతదృష్టేః
పరీతదృష్టేర్జగదేవ సత్స్యాత్
అతద్జ్ఞదృష్ట్యాతు మణిశ్శిలా స్యా
త్తద్జ్ఞస్యదృష్ట్యాతు శిలామణిస్స్యాత్. ౧౧౮

తే. గీ. విషమదృష్టికి సత్తైయూ విశ్వమెల్ల
విశ్వమే సత్తుగాఁదోచు విమలదృష్టి
కజ్ఞదృష్టికి మణి తాయియగ్గె తోచు
తద్జ్ఞునకు తాయియూ మణి తత్త్వమింతె. ౯౯

శ్లో. అధిష్ఠానే పరిజ్ఞాతే సచ్చిదానందలక్షణే
బ్రహ్మైవ సకలంవిశ్వం భోక్తృభోగ్యాదిలక్షణం. ౧౧౯

శ్లో. బ్రహ్మైవ పంచభూతాని బ్రహ్మైవ భువనత్రయం
బ్రహ్మైవాహం బ్రహ్మచత్వం బ్రహ్మణోఽన్యన్నకించన.

సీ. సచ్చిదానంద లక్షణమైన బ్రహ్మంబె
జగమునకగు నధిష్ఠానమనుచు
నెఱిగినవానికి నీభోక్తృభోగ్యాది
కంబగు జగము బ్రహ్మంబెచూడ

పంచభూతంబులు బ్రహ్మమే భూర్భువ
స్స్వర్లోకములు మూడు బ్రహ్మమదియె
బ్రహ్మమేనేనును బ్రహ్మమే నీవును
బ్రహ్మంబుగాని దేవస్తువేని

తే. గీ. గలుగ దినుమంత యును; లెస్సకల దెలిసిన
వానికా కలఁ దోచిన వస్తుసమితి
యుండునే యాత్మభిన్నమై యొండురీతి
బాధనొందనివస్తుభావంబునొంది? ౧౦౦

శ్లో. చిద్వ్యోమ కేవల మనంత మనాదిమధ్యం
బ్రహ్మైవభాతి నిజచిత్తవశా త్స్వయంభూః
ఆకారవానివ పుమానివ వస్తుతస్తు
వంధ్యాతనూజఇవ తస్యతు నాస్తిదేహః. ౧౨౧

శా. ఆకాశంబునుఁబోలి బోధమయమై యాద్యంతముల్మధ్యమున్
లేకద్వైతము బ్రహ్మమే వెలయు; దానిం జిత్తమంటంగఁదా
నాకారంబునుదాల్చి పుట్టి పురుషుండైనట్లు కన్పట్టు; లే
దే కాలంబున వంధ్యపుత్రునకున ట్లాకాయమున్ దానికిన్ ౧౦౧

శ్లో. మయాతతమిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా
మత్స్థాని సర్వభూతాని నచాహం తే ష్వవస్థితః. ౧౨౨

శ్లో. నచమత్స్థాని భూతాని పశ్యమేయోగమైశ్వరం
ఇతి విశ్వవ్యాపకత్వాధారత్వే చాత్మనోహరిః. ౧౨౩

శ్లో. సూచయిత్వాఽపనుదతి భూతేషు స్వస్యసంస్థితిం
భూతానామపి స్వస్థత్వం స్వస్యాద్వైతత్వసిద్ధయే ౧౨౪

శ్లో. అద్వయత్వమతస్సిద్ధం ప్రమాణై రఖిలై రపి
నై వాత్రసంశయః కార్యో బ్రాహ్మణై ర్బ్రహ్మవాదిభిః౧౨౫

సీ. అఖిల జగంబు నే నవ్యక్తమూర్తినై
వ్యాపించియుందు నాయందె యుండు
భూతంబులెల్లను; భూతంబులందు నే
లే నవి నాయందు లేవు చూడు
మర్జున యిద్ది నా యైశ్వరయోగమం
చాత్మవిశ్వవ్యాప్తి నాశ్రయత్వ
మును మున్ను సూచించి తనకు నద్వైతత్వ
మొనరు పొందెను హరి తనదు భూత

తే. గీ. వాసమును భూతముల యాత్మ వాసమును ని
రాకరించెను గాన సర్వప్రమాణ
సిద్ధ మాత్మకు నద్వయస్థితి; విశయము
వలవదిట బ్రహ్మవాదులౌ బ్రాహ్మణులకు. ౧౦౨

శ్లో. విచార్యమాణే సద్బుద్ధ్యా శ్రుతిస్మృత్యుపపత్తిభిః
సదేవేదం జగత్సర్వం సద్వివర్తం యతస్స్వయం. ౧౨౬

తే. గీ. తేటమగు బుద్ధితోడ శ్రుతి స్మృతులనుఁ
బట్టి చూడగ జగము సర్వంబు సత్తె

తథ్య మిదియెల్ల సద్వివర్తంబెకాన
లేదు సద్భిన్న మిందొక్క లేశమైన. ౧౦౩

శ్లో. హేమ్నోవివర్తం కటకం హేమైవభవతి స్వయం
శిలావివర్త శ్శ్రీవిష్ణు శ్శిలైవ భవతి స్వయం. ౧౩౭

శ్లో. యథాత్మైవ సకలం స్వరూపేణ స్వయం జగత్
బ్రహ్మైవ తస్య నిత్యత్వా త్తదభావ సిద్ధ్యతి. ౧౩౮

శ్లో. వాఙ్మాత్రలాభ స్తత్పక్ష స్త్వజ్ఞతా మతిదూరతః
లోకే వస్తు స్వభావాఖ్య మితియేతువదంతితే. ౧౩౯

శ్లో. న శ్రోత్రియా నశాస్త్రజ్ఞా నతత్త్వజ్ఞా నసాధవః ౧౩౯ 4

సీ. కనకవివర్తంబు కటకంబు కనకంబె
యశ్మవివర్తుఁడౌ హరియు నశ్మ
మట్లె బ్రహ్మవివర్త మఖిలజగంబును
బ్రహ్మమే నామరూపముల తోడ
ననిన బ్రహ్మము నిత్యమగుట నీ జగమిట్లె
నిత్యమై యుండు; దీనికి నభావ
మెప్పుడు గల్గమి నొప్పెదవే? యన్న
నది నీకు వాఙ్మాత్ర మైనలాభ
తే. గీ. మగుట నీపక్ష మతిదూరమందె వినుము;
కల దభావంబనెడి వస్తు విల ననియెడు
వారు శ్రోత్రియులేనిఁ దత్త్వజ్ఞులేని
సాధుజనులేనిఁగారు శాస్త్రంబుఁ గనరు. ౧౦౪

అభావోపిచ భావోపి సర్వం బ్రహ్మైవ తచ్ఛృణు. ౧౩౦

శ్లో. సచ్చ త్యచ్చే త్యుపక్రమ్య జగద్వ్యాప్తిం స్వయం శ్రుతిః
సత్యం చానృతంచ సత్య మిత్యంతె గ్రంథ తస్స్ఫుటం. ౧౩౧

శ్లో. సద్బ్రహ్మైవ భావవత్సర్వ మితివ_క్తి స్వయం యతః
తతోభావాభావ రూపం సకలం సత్యమేవ హి. ౧౩౨
శ్లో. బ్రహ్మైవ సత్యశబ్దార్థ స్సత్యం జ్ఞాన మితి శ్రుతేః. ౧౩౪

సీ. భావంబుగాని యభావంబుగాని స
ర్వంబు బ్రహ్మంబె; నిర్ణయము శ్రుతిని
వినుము 'సచ్చత్యచ్చ' యని మొదల్కొని తుదఁ
దాను 'సత్యంచా నృతంచ సత్య'
మని బ్రహ్మ మీ జగం బంతయు నౌట స్ప
ష్టంబుగా నుపనిషదంబ వలికె
స_త్తగు బ్రహ్మమే సర్వంబు నయ్యెన
న్నిగమో_క్తివలననే నిశ్చయముగ

తే. గీ. భావరూపం బభావరూపంబు సకల
మౌ జగము సత్యమే; సత్యమను పదమున
కర్థమగు 'సత్యం జ్ఞాన' మనుట వలన
బ్రహ్మమే; సంశయం బిఁక వలదు వలదు. ౧౦౫

గ్రహీతు ర్గ్రహదోషేణ నానాత్వం నచవస్తునః. ౧౩౩
శ్లో. తద్దృష్టం స్థాణురజ్జ్వాదౌ పండి తైర్వస్తుదర్శిభిః.

ఏకఏవ స్వయం స్థాణు ర్నిజలక్షణ లక్షితః. ౧౩౪

శ్లో. గ్రహీతురేవ ధీదోషా త్ప్రత్యయ స్తస్కరాత్మనా
ఉదేతి స్తంభరూపేణ స్థాణు స్తిష్ఠతి నాన్యథా. ౧౩౫

శ్లో. తద్వదేవ గ్రాహకాణాం ప్రత్యయో జగదాత్మకః
జాయతే బుద్ధిదోషేణ స్వయం బ్రహ్మ త్వవిక్రియం. ౧౩౬

సీ. తెలియుచుండెడువాని తెలివిదోషముననే
వస్తు వొక్కటె తోచుఁ బలువిధముల
ప్రత్యక్ష మిది స్థాణురజ్జ్వాదులందుఁ ద
త్త్వంబుఁజూచినయట్టి పండితులకు
మొద్దొక్కటే తన మొదలిరూపున నుండ
దొంగగా నుంజగాఁ దోచుటెల్ల
తెలిసెడువాని బుద్ధిని గల్గు తప్పున;
మొద్దు వేఱొకరీతిఁ బొందదెపుడు

ఆ. వె. నల్లె చూచువారిడగు బుద్ధితప్పున
బ్రహ్మ మదియె జగముపగిదిఁ దోచు
నంతెకాని బ్రహ్మ మావంతయేని వి
కారమొంద దెపుడుగాని యనఘ. ౧౦౬

శ్లో. అనాదికాలీననిరంతవాసనా
దోషేణ దుష్టా పురుషస్య బుద్ధిః
నానావిధం విశ్వ మిహా ప్రసూతే
స్వప్నాదివ ద్బ్రహ్మణి కేవలేఽద్వయే. ౧౩౭

తే. గీ. ఎంతకాలంబునుండియో యెడపకుండు
వాసనల దోషమున దుష్టభావమొంది
పూరుషునిబుద్ధి కలలట్లు భువనముల ని
రంజనాద్వయబ్రహ్మంబునందుఁ జేయు. ౧౦౭

శ్లో. న బ్రహ్మణా నాపిశివేన విష్ణునా
స్వప్నప్రపంచో నకదాపి దృష్టః
స్వయం ధియా కల్పితఏవ భాతి
తథైవ జాగ్రత్యపి బుద్ధికల్పితః. ౧౩౭

తే. గీ. స్వప్న కల్పితమైన ప్రపంచ మజుఁడు
గాని శివకేశవులు గాని కాంచియుండ
రేపుడు; నది బుద్ధికల్పిత మెంతయైన
నట్లు మెలఁకువ నిది బుద్ధినైన సృష్టి. ౧౦౮

శ్లో. ధీకల్పితత్వేన హి జాగ్రదీక్షితం
న స్వప్నకాలే జగ దస్తి తద్వత్
స్వప్నేక్షితం నాస్తిచ జాగ్రతీహ
ద్వయోశ్చ సుప్తా వశ్శూన్యతా తతః. ౧౩౮

తే. గీ. కనఁబడు మెలంకువను బుద్ధికల్పితంబె
స్వప్నకాలంబునం దట్టి జగము లేదు
లేదు మెలకువ స్వప్నకల్పితజగంబు
గాన నివి రెండు నిదురలోఁ గానరావు. ౧౦౯

శ్లో. యత్రచిత్తం తత్రవిశ్వం స్వయమేవ ప్రతీయతే
యత్రచిత్తం నాస్తి తత్ర నాస్తి కించి జ్జగత్కథా. ౧౮౦

శ్లో. స్వప్నేపి జాగ్రత్యపి చిత్తసత్త్వా
త్ప్రతీయతే విశ్వ మశేష మేతత్
చిత్తస్య నాశేసతి సుప్తికాలే
నాస్త్యేవ విశ్వం సకల ప్రసిద్ధేః. ౧౮౧

తే. గీ. చిత్తమొందుండు నందె జగత్తు దోచు;
నెందుఁ జిత్తంబులేదు లేదందు జగము
వాగ్ర ఝుంత్రైన; మెలఁకువన్ స్వప్నమందుఁ
జిత్తమునఁ దోచు నశేష జగము. ౧౧౦

క. నానావిధవాసనలకు
లోనగుఁ జిత్తంబు నిదురలో నెప్పుడు దా
లీనంబగు నప్పుడు తద
ధీనంబగు జగము లేమి తెల్లంబె కదా. ౧౧౧

శ్లో. భ్రాంతిమాత్ర మిదం విద్వ్ది విశ్వం బ్రహ్మణి కల్పితం
విద్ధి యస్మా త్స్వయం విశ్వం బ్రహ్మజ్ఞానేన బాధ్యతే. ౧౮౨

తే. గీ. బ్రహ్మమునఁ గల్పితంబగు భ్రాంతిమాత్ర
మీజగంబెల్ల; నట్లౌటనే కదయ్యా
బాధితం బగుచుండు విశ్వం బశేష
మరసి గురుకృపవలన బ్రహ్మంబు నెఱుఁగ. ౧౧౨

శ్లో. శుక్తిజ్ఞానా ద్యథా రూప్యం రజ్జుజ్ఞానా ద్యథోరగః
తథాధిష్ఠానతత్త్వబ్రహ్మజ్ఞానా ద్విశ్వం సదృశ్యతే. ౧౪౩

తే. గీ. శుక్తియిదియని యెఱిగినచోట వెండి
తాఁడిదియటంచు నెఱుఁగ సర్పంబు నట్లు
జగదధిష్ఠానమైయుండు సత్యమైన
బ్రహ్మమెఱిగినచోఁ గనంబడదు జగము. ౧౧౩

శ్లో. అధిష్ఠానాదర్శనత ఏవ విశ్వభ్రమ స్సతాం
తస్మిన్ దృష్టే జగద్భ్రాంతి ర్దూరాదేవ పలాయతే. ౧౪౪

తే. గీ. సాధులకు బ్రహ్మమందు విశ్వమనుభ్రాంతి
దానియాశ్రయ మెఱుఁగమిఁ మానకుండుఁ;
బరగ నదిగాంచ నీజగద్భ్రాంతి మిగుల
దూరమునుండియే పాఱి తొలఁగిపోవు. ౧౧౪

శ్లో. యదసత్యం బాధ్యతే త చ్ఛుక్తికారజతం యథా
యత్సత్యం బాధ్యతే తన్న శుక్తికాశకలం యథా. ౧౪౫

తే. గీ. ఎది యసత్యము బాధితం బదియె జగతి
ముత్తెపుంజిప్పవెండిఁ బోలి; మఱియు
నెదియె సత్య మబాధితం బదియె జగతి
ముత్తెపుంజిప్పతునుకనుఁబోలి చూడ. ౧౧౫

శ్లో. విశ్వస్య భ్రాంతికార్యత్వా దసత్యత్వంచ బాధనం
న్యాయయుక్తం తతో విశ్వం బ్రహ్మజ్ఞానేన బాధ్యతే. ౧౪౬

తే. గీ. భ్రాంతిచే నైన దీవిశ్వ మంతెకాన
నది యసత్యము బాధితం బయ్యె లెస్స;
యట్లగుటనే కదా విశ్వ మణిగిపోవు
బ్రహ్మ మెఱుఁగుటవలనఁ దా బాధనొంది. ౧౧౬

శ్లో. జాగ్రత్స్వప్నసుషుప్త్యాదౌ వ్యభిచారప్రదర్శనాత్
స్వతస్సత్త్వాదిశూన్యత్వం చిత్తసంభావితత్వతః. ౧౪౭

విశ్వస్య భ్రాంతికార్యత్వ మభ్యుపేతం మహర్షిభిః. ౧౪౮

తే. గీ. నిదుర మెలఁకువ కల యిట్టి యదనులందు
మాఱుచుండుటఁ జిత్తసంభావితంబు
నగుట విశ్వంబునకుఁ దనయంత లేమి
కల్పితత్వంబును మహర్షిగణము మతము. ౧౧౭

శ్లో. నహ్యస్తి కించి త్సత్యత్వం భ్రాంత్యా కల్పితవస్తునః
రజ్జ్వాం కల్పితసర్పస్య సత్యత్వం కేన వీక్షితం. ౧౪౯

తే. గీ. భ్రాంతిచేఁ గల్పితంబైన వస్తువునకు
నిక్కముగ నున్కి యింతయేనియును లేదు;
త్రాటఁ గల్పితమైన సర్పంబు నెవ్వ
డైనఁ గన్గొనియున్నె సత్యముగనుండ? ౧౧౮

శ్లో. యత్రయత్కల్పితంభ్రాంత్యా తత్తు తస్మా న్నభిద్యతే
శుక్తికల్పిత రూప్యస్య శుక్త్యభిన్నత్వదర్శనాత్. ౧౫౦

తే. గీ. దేనియం దేది కల్పితం బౌనొ దాని
కన్న నది వేఱుగామి నిక్కంబు; శుక్తి
యందుఁ గల్పితమైన రూప్యంబు శుక్తి
కన్నఁదా వేఱుగామి నిక్కంబు గాదె? ౧౧౯

శ్లో. పాషాణే పరికల్పితై రవయవైః పాణ్యాదిభి ర్భావితః
శ్రీవిష్ణు ర్నిజరూపతో నహి శిలారూపా త్పృథ గ్విద్యతే
తద్వ ద్బ్రహ్మణి కల్పితస్య జగతో బ్రహ్మస్వరూపా త్పృథ
గ్భేదో నాస్తి యతస్తతస్త్వఖిలం బ్రహ్మైవ సద్వస్తుతః.

చ. శిలఁ బరికల్పితంబులగు చేతులు మున్నగువానితోడ భ
క్తులు మదినెంచు శ్రీహరి శిలాకృతికంటె స్వరూపముతాయిగాని దీ
యిలఁ గలదే? పరాత్మనటులే పరికల్పితమౌట విశ్వముఁ
దెలియఁగ బ్రహ్మభిన్నముగ నిల్వ; దశేషము బ్రహ్మమేయగున్.

శ్లో. యత్సర్వం కల్పితం బ్రహ్మ సర్వం హ్యేతదితి స్ఫుటం
బ్రహ్మైవేదం విశ్వమితి ప్రబ్రవీతి స్వయం శ్రుతిః. ౧౫౧

శ్లో. విశ్వస్య బ్రహ్మమాత్రత్వం తాత్పర్యేణ తతో జగత్
సర్వంబ్రహ్మైవ నాస్త్యత్ర సంశయో బ్రహ్మవాదినాం.౧౫౨

తే. గీ. సకలమును గల్పితంబౌట జగ మిదెల్ల
బ్రహ్మమే స్పష్టముగను; విశ్వం బిదెల్ల
బ్రహ్మమే యని స్ఫుటముగాఁబలుకు శ్రుతియు
జగమునకు బ్రహ్మమాత్రత సంతరింప. ౧౨౧

తే. గీ. కాన నీవిశ్వమెల్లఁ జక్కఁగఁజూడ
బ్రహ్మమాత్రమెయగు; నిందు బ్రహ్మవాదు
లించుకయు సంశయింప; రిదెల్ల శాస్త్ర
సిద్ధ మనుభవసిద్ధము సిద్ధ మగుట. ౧౨౨

శ్లో. రూప్యస్య శుక్తిమాత్రత్వం యథాస్య జగతస్తథా
సిద్ధేతు బ్రహ్మమాత్రత్వే పరస్య బ్రహ్మణ స్సతః. ౧౫౩
సిద్ధమే వాద్వితీయత్వం ప్రమాణై రఖిలై రపి. ౧౫౩౪

తే. గీ. శుక్తిఁదోఁచిన వెండి యా శుక్తిమాత్ర
మైనయట్లు జగంబు బ్రహ్మంబె యగుట
స్థిరపడిన స్వప్రమాణమై సిద్ధమగును
బ్రహ్మమున కద్వితీయత్వపదవి యదియె. ౧౨౩

శ్లో. యతఏవ మతో జీవే సర్వజ్ఞత్వాదయో మృషా
స్వాజ్ఞానకల్పితా స్సర్వే స్వస్మిన్ కించిజ్జ్ఞతాదివత్. ౧౫౪

తే. గీ. అగుట జీవున కల్పజ్ఞతాదులట్టు
సర్వజ్ఞతాదులు నెంచిచూడ
తనునెఱుంగమిచేఁ గల్పితంబు లగుట
నన్నియును మిథ్యలే సంశయంబు లేదు. ౧౨౪

శ్లో. 'మాయామాత్రమిదం ద్వైత' మితి శ్రుతివచోబలాత్
ద్వైతస్య భ్రమకార్యత్వా త్తదంతఃపాతినోఽపి. ౧౫౫

శ్లో. ద్వయో ర్జీవేశ్వరోపాధ్యో స్తథైవోభయగామినాం
సర్వజ్ఞత్వాదిధర్మాణాం మృషాత్వే నోఽత్రసంశయః. ౧౫౬

తే. గీ. పలుకు శ్రుతి మాయమాత్ర మీూద్వైతమనుచు
నగుట ద్వైతము భ్రమకార్య; మందుఁ జేరు
నట్టి జీవేశ్వరోపాధు లఖిలవిత్త్వ
ముఖ్యధర్మంబులును భ్రాంతిమూలకములె. ౧౩౫

శ్లో. యతఏవ మత శ్శుద్ధచిన్మాత్రే ర్తికస్య హాపిసో॥
యుక్తం బ్రహ్మాత్మనో రైక్యం శ్రుత్యుక్తం నవిరుధ్యతే. ౧౩౬

తే. గీ. ఇట్టులగుట విశుద్ధచిదేకరూపు
లైన బ్రహ్మాత్మలకునైక్యమనుదుఁబలికె
నిగను; మని యోగమును లెప్ప నిశ్చయంబు;
దానికి విరోధ మెపుడు నెందేని లేదు. ౧౩౭

శ్లో. పాషాణప్లవనంచాపి సిద్ధ్యే త్కాలవిపర్యయే
న క్వచి చ్ఛ్రుతివాక్యానా మప్రామాణ్యం తు విద్యతే.

క. కాలమువిపరీతంబై, తేలిస బండలును నీటఁదేలుంగా కే
కాలముననైన శ్రుతివాగ్జాలమునందప్రమాణకలుష మొదవునే?

శ్లో. తావద్ధ్యుపాధిసంబంధో యావత్స్యాద్భేదదర్శనం
నభేదదర్శినో జంతో స్సంసారో వినివర్తతే. ౧౩౮

క. జీవేశ్వరులకు భేదము
భావించెడువఱకునగు నుపాధితగుల మా
భావము మానని జంతువు
నేవేళను మానకుండు నీ సంసృతియుఁ. ౧౩౯

శ్లో. 'యదా హ్యేవైష ఏతస్మి' న్నిత్యేవ వదతి శ్రుతిః
భేదదృష్టేస్తు సంసారం దురంతం భయలక్షణం. ౧౬౦

క. ఎపుడితఁడు దీన నేమా
త్రపు భేదముఁ జేసెనేనిఁ దాభయపదమునం
చుపరమములేని భయదా
పపు భవమున భేదదర్శి పడునని శ్రుతియున్. ౧౨౯

శ్లో. తతో నిశ్శేషసంసారోచ్ఛిత్త్యై నిత్యసుఖాప్తయే
జ్ఞాతవ్యం విదుషా సమ్యగ్బ్రహ్మాభిన్నత్వ మాత్మనః ౧౬౧

క. ధీరత సమూలముగ సం
సారముఁ దెగవ్రేసి నిత్యసౌఖ్యముఁ గాంచం
గోరినవిజ్ఞుఁడు లెస్సగ
నారసి తాబ్రహ్మమగుటం దెలియఁగఁదగున్. ౧౩౦

శ్లో. తత స్తయో రఖండత్వ మేకత్వం ప్రతిపాద్యతే
తాత్పర్యేణ మహా శ్రుత్యా తారణార్థం ముముక్షుణాం.

తే. గీ. బ్రహ్మమునకన్న వేఱగు వ్యక్తి యాత్మ
కాదనుట కాగమంబు దా నూఁది యూఁది
వీరియేకత్వము నఖండ విధముఁ దెలుపుఁ
గృప ముముక్షు గణంబు రక్షింపఁ బూని. ౧౩౧

శ్లో. యద్యస్యాకార్యం పరిదృశ్యతే త
త్తన్మాత్రమే వావధృతం ఘటాదౌ

సద్బ్రహ్మణః కార్యమిదంచవిశ్వం
సదద్వయా త్సర్వమిదం సదేవ. ౧౬౩

చ. ఎదియగుదేనికార్య మదియేయగునయ్యది మంటికార్యమై
నదియగుకుండ మన్నెయగునట్లుగ; బ్రహ్మముకార్యమౌజగం
బిదియఖిలంబుబ్రహ్మమె మతేమియుఁగా; దదిసత్తుగాన ని
య్యదియునుసత్తె; కానిదిరవంతయులేదు విమర్శచేసినన్.

శ్లో. నిర్దిశ్యమానోఽపి వికారఏష
భ్రాంతై రతద్బుద్ధిభి రాత్మదోషాత్
సతఃపృథ గ్రూపయితుం నశక్యతే
మృదఃపృథక్త్వేన ఘటాదయో యథా. ౧౬౪

తే. గీ. ఎంతచెప్పిన భ్రాంతుల కీవికార
ముముగ దెలుగమి తద్బుద్ధి విడువకుంట
సత్తుగానిది జగమన శక్యమగునె
మన్నుగానిది యీకుండ యన్నయట్లు? ౧౩౩

శ్లో. యత్ర స్తంభో విశ్వమిదంసమస్తం
బ్రహ్మైవ మృత్తైన్నవయథా ఘట స్తథా. ౧౬౫

క. కావున విశ్వమిదెల్లను
కేవలమగుబ్రహ్మమే యకృత్రిమదృష్టిన్
భావింపుము; మన్నేకద
లోవెలి ఘట మెన్నితట్టులుం జూడంగన్ ౧౩౪

శ్లో. మూర్తామూర్తవికారజాత ముదితం సత్యాదికంస ద్వ్రత
స్త్వచ్ఛే త్యాగమబోధితం బహువిధం యన్నామరూపాత్మకం
తత్సర్వం స్వయ మేకమేవ సదభూ త్తస్మా త్పరం బ్రహ్మణః
కించిన్నాస్తి విచారితం సదఖిలం బ్రహ్మైవ సద్వస్తుతః. ౧౬౫

ఉ. గాలినభంబమూర్తములు; కానివిమూఁడునుమూర్తభూతముల్
జాలఁగఁ దద్వికారములె సత్తని వృత్తని నామరూపముల్
బోలఁగఁగల్గు నీనిగమబోధితవిశ్వమిదెల్ల నేకమై
లీల వెలుంగుసత్తె; మఱిలే దణుమాత్ర మిఁకేదియేనియున్.

శ్లో. ప్రత్యగేవ పరంబ్రహ్మ బ్రహ్మైవప్రత్యగేవతత్
నోభయో రంతరంకించి త్పశ్యంతే శ్రుతయః క్వచిత్. ౧౬౬

తే. గీ. ప్రత్యగాత్మయె బ్రహ్మంబు; బ్రహ్మమదియె
ప్రత్యగాత్మయు; నీరెంటివ్యక్తులకును
భేద మావంతయేనియు వేదచయము
సేయనొల్లదు; వేదాంతసీమయిదియ. ౧౩౬

శ్లో. శ్రుతే స్స్మృతేశ్చాపి తత్త్వం పర్యాలోచ్య స్వయుక్తిభిః
బ్రహ్మాత్మనో ర్నైవభేద మీష త్పశ్యంతి సూరయః. ౧౬౭

క. శ్రుతితత్త్వము స్మృతిభావము
మతిఁగొని తమయుక్తితో విమర్శించి మహా
మతు లాత్మబ్రహ్మములకు
స్థితిభేద మొకింతయేనిఁ జేయరుసూవే. ౧౩౭

శ్లో. విభేదజనకేఽజ్ఞానే నాశ మాత్యంతికం గతే
ఆత్మనో బ్రహ్మణో భేద మసంతం కః కరిష్యతి. ౧౬౮

తే. గీ. వీరికిరువురికిని గను భేద మొదవఁ
జేయు నజ్ఞాన మది మొదలెడఁగఁజెడిన
నాత్మకును బ్రహ్మమునకు లేనట్టిభేద
మెవ్వఁ డెపుడేనిఁ జేయునే యెఱిగియెఱిగి ? ౧౩౮

శ్లో. నామరూపాదయో యత్ర కల్పితా శ్చిత్తవిభ్రమాత్
వ్యోమ్నీవ నగరం య త్తద్బ్రహ్మ తత్త్వమసి ధ్రువం. ౧౬౯

తే. గీ. చిత్తవిభ్రాంతివలన వియత్తలమున
నగరమునుఁబోలి యెందు నీనామరూప
కాదికల్పన లగుచుండు నద్ది బ్రహ్మ
మదియె నీవైతి విదినిశ్చయం బెఱుంగు. ౧౩౯

శ్లో. ద్రష్టృదర్శనదృశ్యానా మభావో యత్రదృశ్యతే
యదేవ కేవలం శుద్ధం బ్రహ్మ తత్త్వమసి ధ్రువం. ౧౭౦

తే. గీ. చూచువాఁడును చూపునుఁ జూడఁబడెడి
విశ్వమును లేమి యెందుఁగాన్పించు నట్టి
యెదియునంటని పరిశుద్ధపదము బ్రహ్మ
మదియె నీవైతి విదినిశ్చయం బెఱుంగు. ౧౪౦

శ్లో. అంతఃపూర్ణం బహిఃపూర్ణం స్వయ మద్వయ మక్రియం
య దనంతం పరంజ్యోతి ర్బ్రహ్మ తత్త్వమసి ధ్రువం. ౧౭౧

తే. గీ. లోనవెలుపలనంతట తానెనిండి
రెండవది లేక చేయకేక్రియయు నంత
మొంద కన్నింటికవధియా జ్యోతి బ్రహ్మ
మదియె నీవైతి విదినిశ్చయం బెఱుంగు. ౧౮౧

శ్లో. యద్ఘ్రాణిహ్యాగ్రాహకాదీనాం భాసకం తద్విలక్షణం
భామాత్రం పరితఃపూర్ణం బ్రహ్మ తత్త్వమసి ధ్రువం. ౧౨౨

తే. గీ. తెలియువాఁడును దెలివియుఁ దెలియఁబడుప
దార్థములనెల్లఁ దెలియుచు నవ్వి తాను
గాక యంతటవెల్గు నొక్కటంటె బ్రహ్మ
మదియె నీవైతి విదినిశ్చయం బెఱుంగు. ౧౮౨

శ్లో. భానునా భాసితం రూపం యథా చక్షు స్తథా మనః
యేనభాత మిదంవేత్తి బ్రహ్మ తత్త్వమసి ధ్రువం. ౧౨౩

తే. గీ. ఇనుఁడువెలిగింప రూపంబు నెట్లు నేత్ర
మెఱుగు నట్లెదివెలిగింప నీప్రపంచ
మంతయునుఁ మానసమెఱుంగు నద్ది బ్రహ్మ
మదియె నీవైతి విదినిశ్చయం బెఱుంగు. ౧౮౩

శ్లో. సకృద్విభాతం పురత స్సర్వస్మా త్సువిభాతియత్
యద్భాస మనుభాతీదం బ్రహ్మ తత్త్వమసి ధ్రువం. ౧౨౪

తే. గీ. విమల కెవ్వని నెయ్యది వెలుఁగుచుండు
నఖిలమునకన్న ముందు నెయ్యది వెలుంగు

నిదివెలుఁగుదేనివెలుఁగున నదియెబ్రహ్మ
మద్దినీనైతి విదినిశ్చయం బెఱుంగు. ౧౭౪

శ్లో. దర్శనం శ్రవణం జ్ఞానం యత్ర నాఽన్యస్య విద్యతే
సూక్ష్మ మవ్యపదేశ్యం యద్బ్రహ్మ తత్త్వమసి ధ్రువం. ౧౭౫

తే. గీ. ఎందుఁ గన విన నెఱుఁగ నింకేదియు నుండ;
దెదియు దేనినెఱుంగజాలదు సుసూక్ష్మ
మగుట; నవ్యపదేశ్యమా నదియె బ్రహ్మ
మద్దినీనైతి విదినిశ్చయం బెఱుంగు. ౧౭౫

శ్లో. నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం
శుద్ధం విజ్ఞాన మానందం బ్రహ్మ తత్త్వమసి ధ్రువం. ౧౭౬

తే. గీ. కేవలము నిష్కళమును నిష్క్రియము శాంత
మమల మనవద్యమును ననాద్యంతసుఖము
నైన విజ్ఞానమాత్రమా నదియె బ్రహ్మ
మద్ది నీనైతి విదినిశ్చయం బెఱుంగు. ౧౭౬

శ్లో. జాగ్రత్స్వప్నసుషుప్త్యాదిప్రపంచో యేన భాస్యతే
తదేవాహ మితిజ్ఞాత్వా త్వన్యత్రాత్మమతిం త్యజ. ౧౭౭

తే. గీ. జాగరస్వప్న సుప్త్యాది సకలలోక
మెవఁడువెలిగింప వెలుఁగొందుఁ బ్రవిమలముగ
నతఁడనేనని బాగుగా నరసి యెఱిగి
యన్యమును నేననుట మానుమయ్య మతిని. ౧౭౭

శ్లో. యద్వత్స్వప్నశరీరకేఽహమితిధీ స్సంభావితానిద్రయా
తద్వజ్జాగ్రతి మాయయాఽత్రవపుషి స్వాత్మత్వధీః కల్పితా
సత్యం నైతదసి త్వమాత్మని ధియా పశ్య స్వమేకాగ్రయా
నిత్యం శుద్ధమనంతమవ్యయసుఖం బ్రహ్మాసి సాక్షా త్పరం.

చ. కలఁగను మేను నేననుచుఁగాదె సుషుప్తిఁదలంచుచుంటి; వీ
మెలఁకువ మాయ నీతనువు మేకొని నేనని చూచెదట్టులే;
కలఁగనిబుద్ధిఁ జూడు మిదిగాప్రసజంబుగనీ; వనంత ని
ర్మలనిజసౌఖ్యరూపుఁడవు బ్రహ్మమెనీవు;యథార్థమింతయుణ్

శ్లో. దేహేంద్రియప్రాణమనోఽహమాద్యై
స్సహస్థితస్సన్నపి సంగహీనం
వ్యోమేవ మేఘైరమలస్వరూప
స్త్వం ప్రత్యగాత్మాసి సదాశివోఽసి. ౧౭౯

తే. గీ. అమలుఁడవు; మబ్బునాకసం బట్లునీవు
ప్రాణమానస దేహేంద్రియాహమాదు
లన్నిటినిఁగూడియుండియు నంటవెది; స
దాశివుండవు ప్రత్యగాత్మవును నీవె. ౧౮౯

శ్లో. క్షరాక్షరాభ్యాంచ విలక్షణస్సన్
క్షరాక్షరవ్యాపృతిహేతుభూతః
తయోశ్చ తత్తద్వికృతేషు సాక్షీ
త్వం ప్రత్యగాత్మాసి సదాశివోఽసి. ౧౯౦

తే. గీ. క్షరముగా నక్షరంబునుగావు నీవు
వానిరెండింటి నడుపించువాఁడ; వవియు
వానివికృతులఁ జూచెడువాఁడవును స
దాశివుండవు ప్రత్యగాత్మవును నీవె. ౧౫౦

శ్లో. అంతర్బహిశ్చైకరసో నిరంతరో
వ్యోమేవపూర్ణో నిరుపాధిరేకః
నిరంతరానందఘనోఽద్వితీయ
స్త్వం ప్రత్యగాత్మాసి సదాశివోఽసి. ౧౫౧

తే. గీ. ఆకసమువలె నంతంబులేక లోన
వెలుపలను నేకరసత వ్యాపించి దేని
నండగొనకుండు సుఖఘనుండై కాకృతివి స
దాశివుండవు ప్రత్యగాత్మవును నీవె. ౧౫౧

శ్లో. త్వం దృశ్యభిన్నోఽపి దృశిస్వరూప
శ్చశశ్వత్ప్రతీతోఽప్యవబోధ మాత్రః
సదేకరూపో హ్యహమాదిముక్త
స్త్వంప్రత్యగాత్మాసి సదాశివోఽసి. ౧౫౨

తే. గీ. తోచునదిగాక వేఱయ్యుఁ జూచెదీవు
తెలియఁబడుచుండియును లెస్స తెలిసెదీవు
మొదలొకఁడవయ్యు నహమాదిముక్తుఁడవు స
దాశివుండవు ప్రత్యగాత్మవును నీవె. ౧౫౨

శ్లో. అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథాఽరసం నిత్య మగంధవచ్చ యత్
అనాద్యనంతం మహతఃపరం ధ్రువం
సదక్షరం తత్త్వమసి ధ్రువంమునే. ౧౨౩

తే. గీ. అవ్యయంబును శబ్దాదు లైదుఁగాని
నిత్య మాద్యంతరహితంబు నిర్మలంబు
స త్తొకటి యక్షరంబు మహత్తుమీఁది
నట్టిదెదియదె నీవై తి వనఘ నిజము. ౧౨౩

శ్లో. నస్థూలోఽసి నసూక్ష్మోఽసి నాపి కారణ విగ్రహః
బ్రహ్మైవాసి నసందేహః ప్రత్యగ్రూపైకలక్షణః. ౧౨౪

తే. గీ. కనుఁగొనఁగ స్థూలసూక్ష్మ కారణములనెడి
తనువు లివి నీవుకావు ? ప్రత్యక్షముగను
సాక్షివై బోధమాత్రలక్షణము గలుగు
బ్రహ్మమే నీవు సందేహపడకు మెపుడు. ౧౨౪

శ్లో. జన్మమృత్యుజరారోగాః కులగోత్రాశ్రమాదయః
స్థూలస్యైవ త వై తేషాం సాక్షిణో నైవ కశ్చన. ౧౨౫

తే. గీ. పుట్టుటయుఁ జచ్చిపోవుట ముదిమి రుజయు
కులము గోత్రము నాశ్రమాదులును స్థూల
దేహ ధర్మంబులే; వీని దెలియుచుండు
నీవికా వెన్నటికి; నిది నిశ్చయంబు. ౧౨౫

శ్లో. కర్తృతా భోక్తృతాఽహంతామమతాదిక లక్షణః
బుద్ధేరేవైష సంసారో నతే సంసృతి సాక్షిణః ౧౮౬

తే. గీ. చేయువాఁడను నే భుజించెదను ఫలము
నేను నాయది యనుట మున్నెన్నన యట్టి
సంసృతి యిదెల్ల బుద్ధిదే; సాక్షినైన
నీ కిది యొకింతయును లేదు; నిశ్చయంబు. ౧౫౬

శ్లో. అజ్ఞాన జడతాఽలస్య మోహా నిద్రాభ్రమా దయః
కారణస్యైవ తేఽమీషాం సాక్షిణో నైవ కశ్చన. ౧౮౭

తే. గీ. తెలియమియు మొద్దుతనమును నలసతయును
మోహనిద్రాభ్రమాదులు పోలుపు మీఱు
కారణ శరీర ధర్మముల్ గాని వీని
గాంచుచుండెడి నీది యొక్కటియుఁ గాదు. ౧౫౭

శ్లో. స్థూలాదిదేహసంబంధో జన్మ మృత్యుశ్చ సంసృతిః
స్వాజ్ఞానేన త్వయా స్వస్మిన్ సర్వమేత త్ప్రకల్పితం. ౧౮౮

తే. గీ. పరగ స్థూలాదిదేహసంబంధములగు
జనియు మృతియును సంసారజాలమెల్ల
నిన్నెఱుంగమి నీయందు నీవె యిది ప్ర
కల్పనము చేసికొంటి వత్యల్ప మతిని. ౧౫౮

శ్లో. రాహుణా గ్రహణం మోక్షో నైవ భానోర్యథాతథా
సంసారబంధో మోక్షశ్చ నైవతే నిర్వికారిణః. ౧౮౯

క. భానుని రాహువు పట్టుట
గాని విడుపుగాని నిజముగా లేకున్న
ట్లీ నిర్వికారునకు నీ
కే నాఁడును లేదు బంధమే మోక్షంబే. ౧౫౯

శ్లో. స్వయం తత్త్వ మవిజ్ఞాయ సర్వం త్వయి వికల్పితం
నిర్వికారే నిరాకారే వ్యోమని శ్యామతాదివత్. ౧౯౦

తే. గీ. ఏవికారంబు నాకారమేని లేని
యాకసంబున నీలత్వమట్లు నీయ
థార్థ మెఱుఁగంగలేమి నీయం దతథ్య
మగు సమస్తంబు గల్పితం బయ్యెఁ జూఁడు. ౧౬౦

శ్లో. ఆరోపిత స్స్యవదేవ భాతి
భ్రాంతస్య యన్య థ్యసదేవ తత్తు
కుంభాకృతిః కుంభమతిశ్చ జాయతే
కుంభాత్మనా పశ్యతి యస్తుమృత్స్నాం. ౧౯౧

తే. గీ. కల్పితవ్యక్తి సత్యంబుకరణిఁ దోఁచు
భ్రాంతునకు; నైన నది యసత్యంతెకాదె?
మన్నుఁ గుంభంబుగాఁ జూచుచున్నవాని
కటఁ బొడముఁ గుంభమతియు గుంభాకృతియును. ౧౬౧

శ్లో. చక్షుష్మతో బుద్ధిమతో వివేకినః
ప్రామాణిక స్యాత్ర యథార్థదర్శినః

అంతర్బహి స్సర్వత ఏవ కుంభో
మృదేవ కశ్చిన్న తతః పరోర్థః. ౧౯-౨

ఆ. వె. కనులుగలిగి బుద్ధిగలిగి ప్రామాణికుం
డై వివేకియై యథార్థమెఱుఁగు
వాని యెదుటి కుండ లోన వెల్పల నెల్ల
యెడల మన్నెగాకయితర మున్నె? ౧౬-౨

శ్లో. విజ్ఞాతేప త్యధిష్ఠానే కల్పితం నైవ దృశ్యతే
రూప్యం కిం దృశ్యతే శుక్తౌ నీలపృష్ఠా దిదర్శనే. ౧౯-౩

తే. గీ. భ్రాంతి కాధారమైనట్టి వస్తు వెఱుఁగఁ
గల్పిత మొకించుకేని యుఁ గానరాదు
నీలపృష్ఠాదులనుఁ జూడఁజాలెనేని
శుక్తి నెనఁడైన వెండిగాఁ జూచునయ్య? ౧౬-౩

శ్లో. రజతం రజతత్వంచ చాకచక్యంచ పాండిమా
సకలం శుక్తిరేవాసీ చ్ఛుక్తి తత్త్వావధారణాత్. ౧౯-౪

శ్లో. తథైవబ్రహ్మణి జ్ఞాతే స్వాత్మనా కేవలాత్మని
బ్రహ్మైవ సకలంవిశ్వం స్థూలసూక్ష్మాది సంజ్ఞితం. ౧౯-౫

ఆ. వె. శుక్తితత్త్వమెఱుఁగ శుక్తియెయగు వెండి
వెండిగుణము మెఱుగు పాండిమయును
నట్లె కేవలాత్ముఁడగు బ్రహ్మమెఱుగ బ్ర
హ్మంబె స్థూలసూక్ష్మమగు జగంబు. ౧౬-౪

శ్లో. చిదేవ దేహా ప్యసవశ్చిదేవ
మన శ్చిదేవాపిచ ధీశ్చిదేవ
చిదేవ కర్తాచ చిదేవభోక్తా
చిదేవభోగ్యంచ చిదేవసర్వం. ౧౯౬

శ్లో. చిదేవ పంచభూతాని చిదేవ భువనత్రియం
చిదేవాహం చిదేవత్వం సర్వమేత చ్చిదేవహి. ౧౯౭

శ్లో. చిత్తేదేహము ప్రాణముల్ మనసు నాచిత్తేసుమీ బుద్ధియున్
చిత్తే కర్తయు చిత్తెభోక్తయును నాచిత్తేయగుఁ భోగ్యమున్
చిత్తేసర్వము పంచభూతములు నాచిత్తే త్రిలోకంబులుఁ
చిత్తేనేనును చిత్తెనీవు నిదియున్ చిత్తే సమస్తంబునుఁ. ౧౯౮

శ్లో. చిదేవేదం సర్వంత్వితి వదతి సాక్షాచ్ఛ్రుతిరపి
ధ్రువం సర్వంవిశ్వం భవతిచ చిదే వానుభవతః
చితోభిన్నం కించిన్నహి కలయితుం క్వాపి విదుషాం
సతాం దృష్టే రస్తి ద్వయవిరహితే బ్రహ్మణి పరే. ౧౯౯

చ. ఇదిసకలంబుచిత్తె యనియె న్నిగమంబు స్ఫుటంబుగా; జగం
బిదినిఖిలంబు స్వానుభవ మేర్పడఁజూడఁగఁ జిత్తెయగు నిజం;
బిదియలచిత్తుగాని దొకయింతయు విజ్ఞులదృష్టి నెందునుం
బొదల; దిదెల్ల రెండవదిపుట్టని బ్రహ్మమె; కాదిఁ కేమియున్.

శ్లో. మృదాదిదృష్టాంతబలేన యుక్త్యా
శ్రుత్యా నుభూత్యా స దిదం విదిత్వా

నిర్మాల్య భేదం స్వమనఃప్రసూతం
స్వస్మిన్ రమ స్వాత్మసుఖేన నిత్యం. ౧౯౯

తే. గీ. అల మృదాదికదృష్టాంతములబలమున
నిగమమున యుక్తి ననుభూతి జగము సత్తు
గా నెఱిగి భేదమంతయు మాని కేవ
లాత్మసుఖమున నెపుడు నీయుంతనుండు. ౧౯౭

శ్లో. నిరస్తభేదే నిఖిలాత్మనా స్థితే
నిరాస్పదే బ్రహ్మణి నిత్యసిద్ధే
నిరంతరానందఘనే నిరీహే
స్వస్మిన్ రమ స్వాత్మసుఖేన నిత్యం. ౨౦౦

చ. సకలవిభేదముల్ దొలఁగి సర్వముదానయి దేనియుండఁ జే
రక సతతంబు నొక్కటియి రంజిలుచున్ వికలుండుగాక కో
రిక యెదియేని నొందక సమృద్ధసుఖంబగు బ్రహ్మమందు; నం
దకలుషమైనయాత్మసుఖమందుచు నెప్పుడుఁ గ్రీడసేయుమా.

శ్లో. అవిద్యమానార్థవిశేషకల్పనా
విచక్షణం సంసృతి కారణం మనః
నిగృహ్య సర్వైః కరణైః స్వ హాత్మని
స్వస్మిన్ రమ స్వాత్మసుఖేన నిత్యం. ౨౦౧

తే. గీ. లేనియర్థంబులెల్లఁ గల్పించఁగలిగి
యఖిలసంసారహేతువై నట్టి మనసు

నన్నియింద్రియములు బుద్ధియందు నాఁగి
యాత్మసుఖమున నెపుడు నీయంత నుండు. ౧౬౯

శ్లో. అపారసంసార నిదానవాసనా
గ్రంథిక్షయం సాధు విధాయ యుక్త్యా
అఖండబోధైకరసే సదాత్మని
స్వస్మిన్ రమ స్వాత్మసుఖేన నిత్యం. ౨౦౨

తే. గీ. ముగియఁజేసి సంసారమునకు హేతు
వులగు వాసనలను యుక్తిఁ బొలియఁజేసి
తెగని మాఱని సత్యమౌ తెలివె యగుచు
నాత్మసుఖమున నెపుడు నీయంత నుండు. ౧౭౦

శ్లో. పశ్చాత్పురస్తాదపి చోపరిష్టా
ద్దిశస్సమంతాద్విదిశో ప్యధస్తాత్
పూర్ణం సదాత్మాన మవేక్షమాణ
స్స్వస్మిన్ రమ స్వాత్మసుఖేన నిత్యం. ౨౦౩

తే. గీ. ముందు వెనుకను ప్రక్కల క్రింద మీఁద
దిక్కుల విదిక్కులందు నేప్రక్కఁజూడ
నిండియుండు సదాత్ముగా నిన్ను చూచు
చాత్మసుఖమున నెపుడు నీయంత నుండు. ౧౭౧

శ్లో. స్వానందపీయూషనిధౌ నిమగ్నో
నిగృహ్య బాహ్యాంతరసర్వచారం

తదేకతాపన్నమనా నిరీహ
స్స్వస్మిన్ రమ స్వాత్మసుఖేన నిత్యం. ౨౦౪

తే. గీ. నిజసుఖామృతనిధిలో మునింగి లోన
వెల్పలను జేగు బుద్ధిప్రవృత్తి నుడిపి
యిచ్ఛ లే కాత్మ నేకాగ్రవృత్తి నిలిపి
యాత్మసుఖమున నెపుడు నీయంత నుండు. ౧౭౨

శ్లో. కోనామ విద్వా నపహాయ నిత్యం
బ్రాహ్మం స్వతఃప్రాప్త మఖండసౌఖ్యం
కథం రమే తాసతి తుచ్ఛకల్పే
మృషాత్మకే వైషయికే సుఖేఽత్ర. ౨౦౫

చ. తెలిసినయెవ్వఁడైనను సతిస్థిరమున్ దనయంతఁ బ్రాప్తమై
యొలయు నఖండచిత్సుఖమునొల్ల కసత్యముఁ దుచ్ఛకల్పమున్
గలవలెఁ గల్లయౌ విషయకల్పితసౌఖ్యమె లెస్సయంచు ని
చ్చలుఁ గొని క్రీడసల్పునె యసన్మతి పోలిక నీజగంబునన్. ౧౭౩

శ్లో. త్యక్త్వాత్మానం సదానందం విషయాన్ యస్తు సేవతే
పిపాసార్థం సుధాం త్యక్త్వా గరళం పాతుమిచ్ఛతి. ౨౦౬

తే. గీ. ఎవఁడు నిత్యసుఖాత్ముఁడై యొసగు నాత్మ
విడిచి విషయసుఖంబునఁ బ్రీతిసేయు
వాఁడు దగఁదీర్చుకొన సుధ వదలి కాల
కూటము సమాదరంబునఁ గ్రోలఁ గోరు. ౧౭౪

శ్లో. య స్స్వాత్మసుఖ ముత్సృజ్య సుఖం బాహ్య మపేక్షతే
కరస్థం పాయసం త్యక్త్వా స మూఢో లేఢి కూర్పరం. ౨౦౭

తే. గీ. ఎవ్వఁ డాత్మసుఖంబెల్ల నెడలవిడచి
వెలుపలి సుఖంబు నొంద నపేక్షసేయు
నతఁడు పుడిసిటిలోని పాయసము విడిచి
యాస మోచేయి నాకు మూఢాత్మకుండు. ౧౭౫

శ్లో. య ద్యానందం స్వ మాత్మానం త్యక్త్వేచ్ఛే త్పరత స్సుఖం
స్వానందానుభవాభావ స్తేనైవా స్యానుమీయతే. ౨౦౮

తే. గీ. అరయ నెవఁడేని నాత్మసుఖానుభవము
విడిచి పెఱచోట సుఖమొందఁ గడగుచుండు
నతని కేమియు స్వానంద మలవడదని
సంశయింపక యూహింపఁ జాలు నదియె. ౧౭౬

శ్లో. భోగ్యదృష్టి స్సదా యస్య న తస్య బ్రహ్మదర్శనం
యస్యాస్తి సర్వదా ధ్వాంతం న తస్యార్కవిలోకనం. ౨౦౯

తే. గీ. ఎవని కెప్పుడు విషయానుభవమునందె
రక్తి యతనికి బ్రహ్మదర్శనము సున్న;
యెవని కెపుడును జీకటే యెందుఁ జూడ
నతని కాదిత్యుఁ జూడఁగా నగునె? చెపుమ. ౧౭౭

శ్లో. అద్వితీయం పరం బ్రహ్మ సర్వతః పశ్యత స్సతః
ప్రపంచదర్శనం కష్టం కుతో భోగ్యాభిమర్శనం. ౨౧౦

తే. గీ. ఎందుఁ జూచిన నన్య మొక్కింతలేని
బ్రహ్మమే కానవచ్చు నా పావనునకు
జగముఁ జూచుటయే కష్టమగు ననంగ
భోగ్యవిషయాభిమర్శనంబునుఁ గలుగునె? ౧౭౮

శ్లో. బ్రహ్మవి ద్బ్రహ్మభూతస్సన్ బ్రహ్మణ్యేవ రమ త్యలం
ఇష్టానిష్టార్థయోః క్వాపి న హృష్యతి న శోచతి. ౨౧౧

తే. గీ. బ్రహ్మ మెఱిగినవాఁడు తా బ్రహ్మమె యయి
బ్రహ్మమందునె క్రీడాపరత్వమొందు
నిష్టమౌనెడ సంతోషమేని నిష్ట
పడనియెడ దుఃఖమేని నెప్పుడునుఁ బడఁడు. ౧౭౯

శ్లో. అఖండసచ్చిదానందం బ్రహ్మైవాస్మి నచేతరత్
ఇత్యాత్మ నానుభవతో బ్రహ్మనిష్ఠస్య యోగినః. ౨౧౨
యతే ర్నిష్పద్యతే నిత్యం నిర్వాణసుఖ ముత్తమం. ౨౧౩

ఆ. వె. నే నఖండసచ్చిదానందమౌ బ్రహ్మ
మదె మఱేమి గానటంచు ననుభ
వంబు గలుగు యోగి బ్రహ్మనిష్ఠుఁడు యతి
గాంచు నిరతిశయసుఖంబు నెపుడు. ౧౮౦

శ్లో త్యక్త్వాబాహ్యమిదం మనోవిలయనంతుచ్ఛంమృషేతిస్వయం
బుద్ధ్యా నిశ్చలయా గురూక్తిపరయా విజ్ఞాయ తత్త్వం మునేః

బ్రహ్మణ్యస్తభిదే చిదాత్మని సదానందేఽద్వయే నిర్గుణే
లీన స్యాంతగతి స్సుఖేన వసత స్తూష్ణీం కిమన్యై ర్భ్రమైః.

సీ. వెలుపల నున్నయట్టులె తోచు నీవిశ్వ
మంతయు మనసుతో నణగిపోవు
కలవంటి తుచ్ఛమౌ కల్పనయని రోసి
స్థిరబుద్ధితో గురువరునిఁజేరి
వారివాక్యములు తాత్పర్యంబుతో విని
తత్త్వమౌ మహితాత్ముఁడయి నెఱింగి
భేదముల్ లేక చిద్వృత్తియై విభువని
యానందమై యద్వయంబు నగుణ

తే. గీ. మైన బ్రహ్మంబునందు నిలీనుఁడై యె
వండు సుఖముండు వాఁడె కైవల్యమొందు
సందియములేదు శ్రుతి కిది సమ్మతంబు
వేఱుభ్రాంతులు వట్టివి వేయునేల? ౧౮౧

శ్లో. అస్మాచ్ఛరీరా దహమాదికా న్మని
స్సమ్యక్సముత్థో యది బోధదృష్ట్యా
జ్యోతిః పరం తత్త్వ ముపేత్య తేన
స్వేనాత్మనా తిష్ఠతి య స్స ముక్తః. ౨౧౪

తే. గీ. అహముమున్నైనవగు దేహమందుఁ దగులు
వడక సద్బోధదృష్టిచేఁ బరమతత్త్వ
మైన జ్యోతి నెఱింగి తా నదియె యగుచు
నుండు నెవ్వండు వాఁడె ముక్తుండు జగతి. ౧౮౨

శ్లో. ప్రత్యగ్దృశా స్వాత్మతయైవ నిత్యం
పశ్య న్నపావృత్తబహిర్దృశా
నిరంతరానందరసాభిపూర్ణయా
వృత్త్యా సదా తిష్ఠతి య స్స ముక్తః. ౧౦౫

తే. గీ. తాను నెప్పుడుఁ బ్రత్యగాత్మయయి చూచు
చన్యమౌ వెలివాసన నవలఁద్రోచి
యెడతెగని సౌఖ్యరసమగు వృత్తి నిండి
యుండు నెవ్వండు వాఁడె ముక్తుండు జగతి. ౧౧౩

శ్లో. ఉన్మత్తవ ద్బాలవద ప్యయత్నా
న్నిర్వర్త్య దేహస్థితి మాత్మనిష్ఠః
సదేహగాహానుగతాత్మవృత్తి
రేకాత్మనా తిష్ఠతి య స్స ముక్తః ౧౦౬

తే. గీ. బాలకుని వెఱ్ఱివానినిఁ బోలి దేహ
యాత్ర నవశత నడుపుచు నాత్మనిష్ఠ
తో సదేహాలు దీసెడు త్రోవఁ జనుచు
నుండు నొకఁడయి యెవఁడు ముక్తుండు వాఁడె. ౧౧౪

శ్లో. సాక్షిణ్యశేషం ప్రవిలాప్య దృశ్యం
త మద్వయే బ్రహ్మణి నిష్ప్రపంచే
తత స్స్వయం వ్యోమవదేవ పూర్ణా
త్మనా త్మనా తిష్ఠతి య స్స ముక్తః. ౧౦౭

తే.గీ. అద్వయము నిష్ప్రపంచంబు సాక్షి యైన
బ్రహ్మమున దృశ్యమంతయుఁ బరగ నణచి
యంత నాకసమట్లు పూర్ణాత్ముఁడగుచు
నుండు నెవ్వండు వాఁడె ముక్తుండు జగతి. ౧౮౫

శ్లో. సర్వేషు భూతే ష్వవలోక్య చ స్వం
సర్వాణి భూతా న్యపి చాత్మని స్వే
స్వమేవ సర్వం సమవేక్ష్య పశ్చా
త్సర్వాత్మనా తిష్ఠతి య స్స ముక్తః. ౨౮

తే. గీ. అఖిలభూతములందుఁ ద న్నఖిలభూత
ములనుఁ దనయందుఁ జూచుచుఁ బూర్ణుఁడైన
తాన సర్వంబుగా జూచి తానుమాత్రి
ముండు నెవ్వండు వాఁడె ముక్తుండు జగతి. ౧౮౬

శ్లో. ఆశా యస్య విలోకితేపి విషయే నోదేతి నాప్యాగ్రహా
బ్రహ్మణ్యేవ తదాత్మనా స్థితతయా నాఽహంమతి ర్వర్ష్మణి
నేదం కార్య మకార్య మిత్యపి కథా బాహ్యార్థసంభావనా
జీవన్నేవ స ముక్త ఇత్యభిదధే ప్రాచీనవాచంయమీ. ౨౯

సీ. ఎవ్వని కనుచూపు సోకినంత సోకినచోటఁ
బొడమ వాశయు లోభమును మనమున
బ్రహ్మమై యెవ్వఁడు బ్రహ్మమందేయుంటఁ
దనువును దానని తలఁప డెపుడు

వెలుపలఁ దోఁచెడి విషయంబులందుఁ గా
ర్యంబిది యిదియకార్యం బటంచు
నెవనికి భేద మొక్కింతయుఁ దోపదు
జీవించియును వాఁడె కేవలుండ

తే. గీ. టంచుఁ బలికిరి ప్రాచీనులైన మునులు;
వ్యవహృతిఁ జరించుచుండియు నంటకుండు
నట్టిదశయిది; యిదియు బాహ్యార్థములఁ ది
రస్కరించుటనే కల్లు మస్కరులకు. ౧౮౭

శ్లో. త్వం నిర్వికల్పేన సమాధినా స్వం
సర్వాత్మకం వీక్ష్య వివేకదృష్ట్యా
స్వాత్మన్యశేషం ప్రవిలాప్య దృశ్యం
పూర్ణాత్మనా తిష్ఠ సుఖం విముక్తః. ౨౨౦

తే. గీ. నీవును వివేకదృష్టిచే నిర్వికల్ప
మగు సమాధిని నిన్ను సర్వాత్మకునిగ
గని యఖిలదృశ్య మాత్మయందణచి విముక్తి
నొంది పూర్ణుండవై సుఖం బుండుమెపుడు. ౧౮౮

శ్లో. విషయాణాం స్మృతి శ్శాఖా
పక్షౌ ద్వౌ చిత్తపక్షిణః
తాభ్యాముడ్డీయతే చిత్తం
తదుచ్ఛేదేన శామ్యతి. ౨౨౧

తే. గీ. విషయములపైని తలఁపును విడనికోర్కి
చెక్కు లీరెండుఁ జిత్తము న్పక్కఁ గరయు
వానిబలమునఁ జిత్తంబు పఱచుదివిని
వానిఁ దెగనేయ నది శమంబూని నిలుచు. ౧౮౯

శ్లో. మా మయం హంతి విషయో బంధకత్వస్వభావతః
ఇతినిశ్చిత్య విసృజే ద్యతి ర్వైషయికీం స్పృహాం. ౨౨౨

తే. గీ. పట్టి బంధించు నా స్వభావంబుగలది
యగుట విషయంబు నన్నుఁ జంపుననుచు నిశ్చ
యించి వైషయికంబగు స్పృహను వదలి
యతివరుం డాత్మనిష్ఠుడై యలరవలయు. ౧౯౦

శ్లో. తత స్స్వతత్త్వావగతే ర్వ్యధీయతే
వేదాంతవాక్య శ్రవణాదిరేవ
న స్నానమంత్రార్చనకీర్తనాది వా
న తీర్థసేవాది చ కర్మ భిక్షోః. ౨౨౩

శ్లో. యుక్తం యతో౽నాత్మమతిప్రవర్థకం
హ్యనాత్మశాస్త్రేరిత మప్యశేషం
న కర్మ మోక్షంప్రతి కారణంత్వితి
స్వయం వినిశ్చిత్య విముక్తి మిచ్ఛతాం. ౨౨౪

శ్లో. న కర్మణా న ప్రజయేతి సాక్షా
త్కర్మాఖిలం సాధు నిషేధతి శ్రుతిః. ౨౨౫

శ్లో. సంన్యస్య శ్రవణం కుర్యా దిత్యాది స్మృతి రప్యలం
విధత్తే శ్రవణం భిక్షో ర్మోక్షమాత్రైక కాంక్షిణః. ౨౨౫

తే. గీ. యతికి నిజతత్త్వమెఱుఁగ వేదాంతవాక్య
ముల విచారంబె యొప్పు నెప్పుడును; దగవు
స్నానములు మంత్రజపము లర్చనలుఁ గీర్త
నాదులును తీర్థసేవాదులైన పనులు. ౧౯౧

సీ. కాన ననాత్మసంగముఁ బెంపుసేయు న
నాత్మశాస్త్రము సెప్పునట్టి కర్మ
మావంతయును మోక్ష మందింపఁజాలదు
నిక్కమింతయునంచు నిశ్చయించి
ముక్తిఁగోరుచునుండు బుధులకు శ్రుతియె ప్ర
త్యక్షంబుగాఁ గర్మమఖిలముఁదప
గట్టిగాఁజెప్పె 'నకర్మణానప్రజ
యా'యంచుఁదా నిషేధార్థకముఁగ

తే. గీ. స్మృతియు సంన్యాసమొనరించి చేయవలయు
శ్రవణమని మోక్షమునుఁగోరు సాధువులకు
విధిగ నిర్ణయమొనరించు విధినిషేధ
శాస్త్రతాత్పర్య మిట్లె ప్రశస్తమయ్యె. ౧౯౨

శ్లో. అయమేవ యతే ర్ధర్మః కర్తవ్యో మోక్షకాంక్షిణః
నైవస్నానం నాపిజపో నపూజాపి నకీర్తనం. ౨౨౬

తే. గీ. ముక్తిఁగోరెడు యతి సేయ ముఖ్యమైన
ధర్మ మీశ్రవణంబు మాత్రంబె కాని
తీర్థసేవలు జపములు దేవపూజ
నములును బరోక్షసంకీర్తనములుగావు. ౧౯౩

శ్లో. యథా తండులసంపర్కా న్నారికేళం వినశ్యతి
యథై వోదకసంపర్కా త్సమూలం మధు నశ్యతి. ౨౨౬

శ్లో. తథా శ్రవణజో బోధః కర్మయోగా ద్వినశ్యతి
తతో ముముక్షోస్తు యతే ర్న కార్యం కర్మకించన. ౨౨౮

శ్లో. సర్వకర్మాణిసంన్యస్యే త్యేవం వక్తి స్వయం శ్రుతిః
శ్రవణాదేః ఫలం ప్రాహు ర్బ్రహ్మాత్మైకత్వబోధనం. ౨౨౯
తదభావే యతే రస్య నిష్ఫలం శుకజల్పవత్ ౨౨౯౪

సీ. బియ్యముతోఁగూడఁ బెట్టిన టెంకాయ
కుళ్లి పాడైనట్లు నీళ్ళుగలియ
తేనియ పులిసి పాడైనతీరునఁ గర్మ
సంగంబు నొందిన శ్రవణజనిత
బోధంబు సెడుఁ గాన ముక్తినే కోరిన
యతిసేయఁదగిన దావంతయైనఁ
గర్మ ముండదు 'సర్వకర్మాణిసంన్యసే
యని శ్రుతి తాన యీయర్థ మనియె

తే. గీ. నట్టి శ్రవణాదులకును బ్రహ్మాత్మ లౌకటె
యను తెలివె యౌ ఫలం; బదియమరదేని

చిలుకపలుకులతీరునఁ బలుకుచుండు
యతికి శ్రవణాదులెల్ల నిరర్థకములు. ౧౯౪

శ్లో. దశధా శతధావాపి శ్రుత్వా మత్వాపివా యతేః
సంసారధ్వంసకం జ్ఞానం సంపాద్య మతియత్నతః. ౨౩౦

తే. గీ. కాన పదిసార్లు నూఱుసార్లైన భిక్షుఁ
డధికయత్నంబులో విని యది మనమునఁ
గను విమర్శించి యెల్లైనఁ బడయు వలయు
సంసృతిని పాఱుసేయు సుజ్ఞాన మదియె. ౧౯౫

శ్లో. తతఆలస్య ముత్సృజ్య శతధాపి సహస్రధా
కర్తవ్యం శ్రవణం భిక్షో ర్నికటే బ్రహ్మవిద్గురోః. ౨౩౧

ఆ. వె. అగుట జాగు మాని యతి బ్రహ్మ మెఱిగిన
గురునిఁజేరి వినుకుఁ గొదుకు లేక
నూఱుమాఱ్లు వేయిమాఱులైనను శ్రవ
ణంబు సేయవలయు జ్ఞానమొంద. ౧౯౬.

శ్లో. శ్రుత్వా తత్త్వమసీత్యేవం బోధ్యమానో ప్యనేకధా
న విజానా త్యయం తత్త్వ మీశానుగ్రహవర్జితః. ౨౩౨

తే. గీ. అద్ది నీవైతి వనుశ్రుతి నాలకించి
దాని యర్థం బనేక విధాలగురువు
బోధఁజేసిన వినియునుఁ బురుషుఁడీశు
కృపకుఁ బాత్రుఁడు గాడేని నెఱుఁగలేఁడు. ౧౯౭

శ్లో. సూతకాది నిరాకారం సాకారమివ పశ్యతి
స్వస్మిన్ దృష్టప్రత్యయేన సూతక్యహమితి స్ఫుటం. ౨౩౩

శ్లో. న తథా బోధిత శ్శ్రుత్వా ముహు స్తత్త్వమసీ త్యలం
విద్వానపి విజానాతి స్వాత్మతత్త్వం మహా దద్భుతం. ౨౩౪

ఉ. ఆకృతిలేనివైనను యథార్థములట్టులె సూతకాదులన్
జేకొనిచూచు; సూతకిని నేనని గట్టిగనమ్ము గాని యీ
లోకమునందు విజ్ఞుఁడును లోలతమాని స్వతత్త్వమాగమాం
తాకలితంబు 'తత్త్వమసి' యన్న సుబోధ మెఱుఁగఁడేమొకో.

శ్లో. సుదర్శ్యాత్ర శిలాం శిలామయగృహే సాక్షా దయంశ్రీహరి
ర్భక్తేభ్యో వివిధాన్ ప్రయచ్ఛతి వరాన్ సంసేవ్యమాన స్త్విత్రి
ఉక్తాం దేవలకస్యవాచ మధికం విశ్వాస్యసంసేవతే
త్వర్థం తత్త్వమసీతి వేదగదితం నోవిశ్వసి త్యల్పధీః. ౨౩౫

మ. ఎవఁడో రాతిగృహంబునందునొకరాయింజూపి చూడుండితం
డవు నా శ్రీహరి తన్నుఁగొల్చు నిజభక్తానీకము న్మెచ్చి యి
చ్చు వరంబుల్వివిధంబు లీతఁడన నాసుద్దిన్ జనుల్ బిట్టు న
మ్మి విధింగొల్తురుగాని నమ్మ రలవాక్యమి న్మద్దియేనీవనన్.

శ్లో. లౌకికే వచనే శ్రద్ధా శాస్త్రీయేచ యథా తథా
వాక్యే తత్త్వమసీ త్యేనం వదంత్యా నశ్రుతేర్నృణాం. ౨౩౬

తే. గీ. కలదు నరులకు శ్రద్ధ లోకప్రయుక్త
శాస్త్రవచనంబునందు నిశ్చయము కాని

యదియెసీవై తివని దయ ననెను వేద
వాక్యమున శ్రద్ధగలుగదు వారి కకట. ౨౦౦

శ్లో. నానాయోని సహస్రసంభవకరం నానావిధార్తిప్రదం
కర్మాపాస్య హృదిస్థితం సదనిశం చిత్తే ప్రసీదత్ స్వయం
రుద్ధ్వానాత్మరతిం తదాత్మకమతిం సంవర్ధయేచ్ఛృణ్వతో
మన్వానస్యచ భానుభాజలవృథే ద్వంద్వే వివేకాద్ధ్రితం.

సీ. వివిధజన్మంబుల వేనవేల్దెచ్చుచు
పలుదెఱంగుల దుఃఖములను నిడుచు
నెనను కర్మంబుఁ దునుముట్టఁ గడద్రోచి
సన్నిష్ఠఁ జిత్తప్రసాదమొంది
తనువుమున్నగు ననాత్మల నాస్థ విడనాడి
శ్రవణంబు మననంబు సల్పుచుండి
పుట్టినసువివేకమున నెండమావుల
జలములట్లుగ ద్వంద్వముల నెఱింగి

తే. గీ. యఖిలమును దాన యైనబ్రహ్మంబునందు
బుద్ధి నెలకొల్పి తాదాత్మ్యసిద్ధి నిల్పు
నట్టివాసన వృద్ధిసేయంగవలయు
జాగుసేయక మోక్షదీక్షాపరుండు. ౨౦౧

శ్లో. యో మోహయతి భూతాని స్నేహపాశానుబంధనైః
సర్గస్య రక్షణార్థాయ తస్మై మోహాత్మనే నమః. ౨౩౮

తే. గీ. సృష్టినంతయుఁ గడక రక్షింపఁగోరి
స్నేహపాశంబులను భూతనిచయ మెవఁడు
కట్టి మోహింపఁజేయు నా ఘనవిమోహ
మయునకుఁ బరాత్మునకు నే నమస్కరింతు. ౨౦౨

శ్లో. దృశ్యప్రత్యయసంతత్యా బ్రహ్మతత్త్వం తిరోహితం
తస్యా నిరాసే బ్రహ్మైవ కేవలం పరిదృశ్యతే. ౨౩౯

తే. గీ. శబ్దముఖదృశ్య సంతతి చాటునందు
బ్రహ్మతత్త్వంబు కానంగఁబడదు; దానిఁ
దొలఁగఁదోసినఁ దనయంత వెలుగుచుండు
బ్రహ్మమే కేవలము గానవచ్చు నెందు. ౨౦౩

శ్లో. అవిద్యయా కల్పితనామరూప
వ్యపోహ ఏవ ప్రయతేత విద్వాన్
న బ్రహ్మబోధే తదపోహమాత్రా
ద్బ్రహ్మైవ భాతి స్వయమేవసాక్షాత్ ౨౪౦

శ్లో. శైవాలమాత్రాపనయే పిపాసోః
కార్యః ప్రయత్నో నతు తోయసిద్ధ్యై
తస్మి న్నపేతే స్వయమేవ తోయం
శుద్ధం ప్రసన్నం విషయత్వ మేతి. ౨౪౧

సీ. కమదప్పిగొన్న యాతఁడు దాపిఁబోయెడు
నీరగపడకుండ నెఱసియుండు
పాచినిఁదొలఁగంగఁ దోచినంతనె తేటి
నిర్మలంబై యుండు నీరు దొరకు

గావునఁ బ్రాచినిఁ గడకుఁ ద్రోయుటె చాలు
నీటికై వాఁడు యత్నింప వలవ
దట్టులే బ్రహ్మబోధావరకంబు ల
విద్యచే నందుఁ గల్పితములైన

తే. గీ. నామరూపంబు లుడుపఁ గానంగవచ్చు
బ్రహ్మబోధమదే దానిఁ బడయుకొఱకు
యత్నమేమియు వలదు తదావరకము
దలగఁద్రోయంగఁ జేయు యత్నంబె చాలు. ౨౦౪

శ్లో. ఘట స్తదంత స్సలిలం తదగ్రే
స్థితం శరావంచ తదంత రంబు
ఉష్ణత్వ మగ్నే ర్వహతి ప్రసాదా
త్త థాఽహమాదిశ్చ సతః ప్రసాదాత్. ౨౪౨

శ్లో. దేహేంద్రియ ప్రాణమనోధ్యహం కృతేః
బ్రహ్మప్రసాదాత్ ఖలు చేతనత్వం
సత్తాభిధానంచ నతు క్వచిత్స్వ యం,
జడాత్మకా భాం త్యహమాదయోఽమీ. ౨౪౩

సీ. బానయు దానిలోపలినీళ్ళు దానిముం
దరనుంచు కుండయు దానిలోని
జలమును నగ్నిప్రసాదంబుచే వేడి
యగునట్లు సత్ప్రసాదాప్తి వలన

నహామాదులును వాని యవ్వల దేహేంద్రి
యప్రాణమానసాద్యములు చేత
నత్వంబు నున్న దనంబను పేరును
గాంచు బ్రహ్మము ననుగ్రహము వలన

తే. గీ. నంతయేకాని యీయహామాదులైన
జడము లెవుడేని స్వప్రకాశంబులగుచు
వెలుగు టెందును గలుగదు వీని ... లగు
టెల్ల నాత్మవెలుంగుగా నెఱుగుమయ్య. ౨౦౫

శ్లో. నిత్యం సదానందరసాను భూతి
మభిన్నవృత్త్యాఽత్మని కుర్వతాం సతాం
ఇంద్రస్యలోకేచకి మబ్జయోనేః
కింవా హరేః కిన్ను శివస్య సాక్షాత్. ౨౦౬

తే. గీ. విమల కానందరసమె యెప్పుడును వేఱు
వృత్తి లేకుండ నెవ్వారి చిత్తమందు
ననుభవంబగు వారికి నజ మహేంద్ర
శంకరాచ్యుతలోక వాసంబు లేల ? ౨౦౭

శ్లో. బ్రహ్మైవ పశ్యతాం సర్వం బ్రహ్మభూతాంతరాత్మనాం
కో బ్రహ్మ కోను విష్ణుర్వా క స్త్రిలోక సుఖప్రదః. ౨౦౮

తే. గీ. అఖిలమును బ్రహ్మముగఁ జూచు చంతరాత్మ
బ్రహ్మమై యుండువారికి బ్రహ్మ యెవఁడు ?

విష్ణువెవ్వఁడు ; తల్లోకవివిధ సౌఖ్య
దాత యెవ్వఁడు ? సర్వంబుఁ దానె కాదె ? _౨౦౬

శ్లో. యత్రాసక్తి ర్మన స్తత్ర తదాకారేణ తిష్ఠతి
స ఏష మనసోధర్మ స్స్వానురక్తాత్మనా స్థితిః. _౧౯౬

ఆ. వె. మనసు దేని లెస్స మఱిగియుండునో దాని
రూపు తానుదాల్చి రూఢి నిలుచుఁ
దానుగోరినట్టి దానిరూపున నుండు
టిది మనస్స్వభావ మెంచిచూడ. _౨౦౭

శ్లో. విషయాకారతాప త్తివృత్తి ర్యేన నిగృహ్యతే
విపశ్చితా మన స్తేన నిర్జితం నాత్రసంశయః. _౧౯౭

ఆ. వె. మనసు విషయరూపమును బొందుటను నిగ్ర
హింపఁగలిగియుండు నెవఁడుండ
తండె మనసుగెల్చియుండు ధీరుండు సం
శయము దీన లేశమయిన లేదు. _౨౦౮

శ్లో. ఉన్మేషశ్చ నిమేషశ్చ సుకరం స్యా ద్యథా తథా
మనోజయోపి సుకరః పురుష స్యాత్మవేదినః. _౧౯౮

తే. గీ. ఱెప్పలెత్తుట వాల్చుట యెప్పగిదిని
సుకరమగు నట్టులే మనస్సును జయించు
టదియు సుకరమె తన్నుఁదా నరసియెఱిగి
యుండు పురుషున కెట్టిపనుండదిందు. _౨౦౯

శ్లో. బ్రహ్మైవాహం నదేహాది రితి స్వం బోధవిగ్రహం
పశ్యతో విదుష శ్చిత్తం వద కుత్రగమిష్యతి. ౨౪౯

తే. గీ. నేను దేహేంద్రియాదులుగాను బ్రహ్మ
మదియెనేనని తన్ను బోధాత్మకునిగ
నేమఱక చూచుచుండు నాధీమహితుని
చిత్త మదియెందుఁజనఁగల్గుఁ జెప్పుమయ్య. ౨౧౧

శ్లో. విషయాకారతాపత్తిమేవ వృత్తే స్థిరస్యతః
సర్వతో విదుష శ్చిత్తం వద కుత్రగమిష్యతి. ౨౫౦

తే. గీ. ఎందుఁజూచినఁ దనమనోవృత్తి విషయ
రూపమును బొందుటదియె యారూఢి నడచి
యుండు నిక్కమెఱింగిన యోగివరుని
చిత్త మదియెందుఁజనఁగల్గుఁ జెప్పుమయ్య. ౨౧౨

శ్లో. శ్రుతందృష్టం స్మృతంపుష్టం సర్వం బ్రహ్మేతిబిద్ధియా
పశ్యతోవిదుషశ్చిత్తం వదకుత్రగమిష్యతి. ౨౫౧

తే. గీ. చెవులవిన్నది కనులఁజూచినది మనసు
నందుఁ దలపోసినది పెంపునొందినదియు
బ్రహ్మ మంతయునని చూచు ప్రాజ్ఞమణికిఁ
జిత్త మదియెందుఁజనఁగల్గుఁ జెప్పుమయ్య. ౨౧౩

శ్లో. అహ మిద మితి కల్పనావకాశో
యది మనసోఽస్తి తదా బహిఃప్రవృత్తిః

అహ మిదమఖిలం సదేవ శుద్ధం
పరమితి దృష్టవతః కుతోఽవకాశః. ౨౫౨

తే. గీ. ఏ నిది యటంచుఁ గల్పింప నెడముగలుగ
మనసు దనయంత బయటఁగుఱిమ్మరును గాని
తాను నిదియెల్లఁ బరము శుద్ధమగు సత్తె
యని కనినఁ గల్పనకు నెడమగునె యెందు. ౨౧౪

శ్లో. నిరంతరాభ్యాసవశా త్స్వయం పక్వో భవే న్మునిః
బ్రహ్మానందసుఖాసక్త్యా సతి బ్రహ్మణి తిష్ఠతి. ౨౫౩

తే. గీ. ఎడగలుగకుండువాడుక యొసకమొసగఁ
దాను పరిపక్వదశనొందు మౌనివరుఁడు
బ్రహ్మసుఖమును మఱిగి యప్పటికి నిల్చు
నతఁడు సన్మాత్రమైన బ్రహ్మంబునందు. ౨౧౫

శ్లో. ఏషోఽహమిద మిత్యాదిప్రత్యయో మనఉచ్యతే
తదభావోఽమనస్కత్వ మద్వయం బ్రహ్మ కేవలం. ౨౫౪

తే. గీ. నేను నీతఁడు నిదియు మున్నైనదృశ్య
మిదియెమన; సమనస్కత యిద్దిలేమి;
రెండవదిలేక తనయంతనుండు బ్రహ్మ
మన నదియె యండ్రు విజ్ఞానఘనులు మునులు. ౨౧౬

శ్లో. జ్ఞాత్రాదిభేదం స్వయమేవ ధృత్వా
నానాత్మ నాథో మనఏవ జృంభతే

మనోవినాశేసతి నైవభేదో
యథా సుషుప్తౌచ తథాసమాధౌ. ౨౫౫

తే. గీ. తానె జ్ఞాత్రాదిభేదంబుఁ బూని మనసె
నీచగతిఁ బెక్కు రూపుల నేచి తోఁచు
మనసునశియించఁప భేదంబు మాసిపోవు
నచ్చపుసమాధిలో నిద్రయందుఁబోలె. ౨౧౭

శ్లో. శృణుష్వ విద్వాన్ మనఏవ జీవో
మనోహి విశ్వం మనఏవ చేశః
మనోహి మాయా మనఏవ బంధో
మనోలయో ముక్తి రయం యథార్థః. ౨౫౬

తే. గీ. విను మనసెజీవుఁ డీవిశ్వమునుమనస్సె
మనసెయీశుండు మాయయున్మనసె చూడ
మనసెబంధంబు నసఁబడు; మనసు లయము
నందుదశ మోక్ష మిదియే యథార్థ మనఘ. ౨౧౮

శ్లో. జ్ఞాత్రాదికల్పనాబీజే విలీనే మనసి స్వయం
తతః కేవలరూపేణ పూర్ణానందాత్మనా స్థితః. ౨౫౭

శ్లో. నాంతరం నాపివా బాహ్యం విద్వాన్ జానాతి కించన
స ఏవ పరమోలాభ స్సైవాస్య పరమాగతిః. ౨౫౮

స ఏవ పరమానందో యా స్థితిః కేవలాత్మనా. ౨౫౮౹

సీ. జ్ఞాతమున్నగువానిఁ గల్పింపహేతువౌ
మానసంబు విలీనమైనయప్పు
డాత్మ యసంగుఁడై యద్వయపరిపూర్ణ
సుఖరసాత్మకుఁడయి చొక్కుచుండు
నాదశనుండు మహాత్ముం డెఱుంగఁ డా
వంతయు లోవెలి నని విభేద
మదె పరమోత్కృష్టమైన లాభం బాత్మ
కదెసుమ్ము గమ్యమైనట్టిపదవి
తే. గీ. యాత్మమాత్రతనుండెడునట్టి స్థితియె
యగును నిరతిశయానందమైన బ్రహ్మ
మదియె తానని యెఱుగమి నయ్యె బంధ
మదియెఱుంగుట జీవున కగు విముక్తి. ౨౧౯

శ్లో. విద్వాన నాత్మతాదాత్మ్యం నిర్దహ్య జ్ఞానవహ్నినా
జీవన్నేవ వినిర్ముక్తో యతో బ్రహ్మాత్మనా స్థితః. ౨౫౯

తే. గీ. ఎఱుకగల పుణ్యమూర్తి దేహేంద్రియాది
కములు దానను భ్రమను జ్ఞానమనునగ్నిఁ
గాల్చి బ్రహ్మంబె తానయి కలఁగకుండుఁ
గాన జీవించుచునె ముక్తిఁగాంచు నతఁడు. ౨౨౦

శ్లో. బ్రహ్మాత్మనా వసన్ విద్వాన్ ముక్తస్థూలాద్యుపాధిభిః
లోకదృష్ట్యా ప్యసౌ జీవన్ ముక్తవ త్సంసృతిః. ౨౬౦
తే. గీ. స్థూలముఖ్యంబులగు నుపాధులను విడిచి
తాను బ్రహ్మమె యైయుండు తత్త్వవిదుఁడు

లోకమునకు జీవించునట్లుగనె తోఁచి
నను నతఁడు ముక్తుఁడే భవంబణఁగెఁ గాన. ౧౧౦

శ్లో. అయమేవ హి సంసారో యాహంమమమతి స్సతాం
దేహతద్ధర్మ తత్కర్మ తదవస్థాసు విభ్రమాత్. ౧౯౦

తే. గీ. తనువుతానని తద్ధర్మతతులు కర్మ
ములు నవస్థలు దనవని తలఁపు సాధు
వులకునైనను విభ్రాంతిఁ బుట్టు టదియె
సుమ్ము సంసారమనఁ బ్రసిద్ధమ్ము జగతి. ౧౧౧

శ్లో. జీవతా యత్తు కర్తవ్యం జీవన్ తన్నకరోతి యః
తం వదంతి జనాస్సర్వే జీవన్ముక్త ఇతి క్షితౌ. ౧౯౧

క. ఏవాఁడు బ్రతికియుండియుఁ
గావింపఁడు బ్రదుకువాఁడు గావించుపనుల్
జీవన్ముక్తుండని యా
కేవలునిన్ జనములెల్లఁ గీర్తింతురిలన్. ౧౧౩

శ్లో. యథాముక్త స్తథాజీవన్ బ్రహ్మణ్యే వాత్మతాధియా
యోఽహంతాం మమతాం దేహే దేహధర్మే పరిగ్రహే.
నకుర్యాత్తమిమం ప్రాహు ర్జీవన్ముక్తం మహర్షయః.

చ. బ్రతికియుఁదానె బ్రహ్మమను ప్రజ్ఞనుఁబూని విముక్తునట్టులా
త్మతనువునం దహంతను మమత్వము దానిస్వభావధర్మసం

తతిని నెవండొకింతయు నొనర్పడు వాని మహర్షులెప్పుడుఙ్
బ్రతికియు ముక్తుఁడేయనుచుఁ బల్కుదు రాదరపూర్ణచిత్తులై.

శ్లో. దేహేంద్రియాదౌ కర్తవ్యే మమాహంభావ వర్జితః
ఔదాసీన్యేన యస్తిష్ఠే జ్జీవన్ముక్త స్స ఉచ్యతే. ౨౯౪

తే. గీ. తనువునను నింద్రియాదులందును నొనర్ప
నైన నేనును నాయది యనెడుతలఁపు
విడిచి యెవ్వఁ డుదాసీనవృత్తి నుండు
నట్టివాని జీవన్ముక్తుఁ డండ్రు బుధులు. ౨౯౫

శ్లో. బ్రహ్మైవేదం సర్వ మిత్యేవ సమ్య
క్పశ్యన్ మన్వానో విజానన్ మహాత్మా
బ్రహ్మణ్యేవ బ్రహ్మరూపేణ తిష్ఠన్
బ్రహ్మానందం బ్రహ్మవి దేవ భుఙ్క్తే. ౨౯౫

శ్లో. ఏవ విద్వా నాత్మరతి రాత్మజ్యోతి రశేషదృక్
ఆత్మక్రీడాత్మమిథున ఆత్మానంద స్సదామునిః. ౨౯౬

శ్లో. ఆత్మతృప్త ఆత్మసుఖ ఆత్మారామో వినిష్క్రియః
జీవన్నేవ విముక్తస్సన్ ఖేల త్యానంద వారిధౌ. ౨౯౭

సీ. ఇదియంతయును బ్రహ్మమేయని లెస్సగాఁ
బరికించి చూచి యేర్పడ విమర్శ
మతిలో నొనర్చి తన్మయతనొందిన మహా
త్ముఁడు బ్రహ్మరూపంబుతోడఁ దాను

బ్రహ్మంబునందుండి బ్రహ్మసుఖంబు ని
రంతరంబుగఁ గొను నట్టివాఁడె
బ్రహ్మవేత్తయును విద్వాంసుఁ డాత్మజ్యోతి
సర్వసాక్షియు నాత్మసౌఖ్య రతుఁడు

తే. గీ. వాఁడె యాత్మద్వితీయుఁడై క్రీడ సల్పు
నాత్మతృప్తుఁడు నాత్మసుఖుండు మౌని
నిష్క్రియుండు నిజానంద నిర్మలాబ్ధి
నోలలాడు జీవన్ముక్తుఁ డొక్కఁడితఁడె. ౧౨౬

శ్లో. అహం మమేతి వ్యవహారతో యో
ముక్తస్స జీవ న్యది ముక్త ఇష్యతే
ముక్తస్య బద్ధస్య విశేషఏష
దేహాద్యహంభావనివృత్తిరేవ. ౨౬౭

తే. గీ. అరయ నేన్నాదియను వ్యవహారములను
విడిచియును నెవ్వఁ డిలను జీవించుచుండు
వాఁడె ముక్తుండు; వానికి బద్ధునకును
సంతగమ్మ దేహాదులేనసమి యొకటె. ౧౨౭

శ్లో. వర్తమానేఽపి దేహేఽస్మిన్ ఛాయావ దనువర్తితే
అహంతా మమతాఽభావో జీవన్ముక్తస్య లక్షణం. ౨౬౮

తే. గీ. నీడపోలికఁ దను వెంటనాడి తిరుగు
నట్టిదైనను నీ దేహమందు నేను

నాది యనుబుద్ధి యెవని కింతయునుఁ గలుగ
దట్టివాఁడె జీవన్ముక్తుఁ డనఁగఁ బరగు.                    ౨౨౮

శ్లో. అతీతాననుసంధానం భవిష్యదవిచారణం
ఔదాసీన్య ముపప్రాప్తే జీవన్ముక్తస్య లక్షణం.                    ౨౭౦

తే. గీ. కడచిపోయిన వానినిఁ దడవికొనక
రాఁగలుగు వానికై విచారమ్ము పడక
వచ్చువాని నుదాసీనభంగిఁ గాంచు
నట్టివాఁడె జీవన్ముక్తుఁ డనఁగ బరగు.                    ౨౨౯

శ్లో. గుణదోషవిశిష్టేఽస్మిన్ స్వభావేన విలక్షణే
సర్వత్ర సమదర్శిత్వం జీవన్ముక్తస్య లక్షణం.                    ౨౭౧

తే. గీ. బాగునోగునుఁ గలిసి స్వభావమునను
వేఱుగాఁ దోఁచుచుండు నీవిశ్వమందు
నంతట సమంబుగాఁ జూచు నమలుఁడెవ్వఁ
డట్టి వాఁడె జీవన్ముక్తుఁ డనఁగఁ బరగు.                    ౨౩౦

శ్లో. ఇష్టానిష్టార్థ సంప్రాప్తౌ సమదర్శిత యాత్మని
ఉభయ త్రాఽవికారిత్వం జీవన్ముక్తస్య లక్షణం.                    ౨౭౨

తే. గీ. తనకు మేలైన కీడైన పనులు పొసగి
నపుడు సమముగఁ జూచువాఁడగుట రెంట
నేవికారంబు లోన వహింప డెవ్వఁ
డట్టివాఁడె జీవన్ముక్తుఁడనఁగఁ బరగు.                    ౨౩౧

శ్లో. యస్యాంశలేశలవ విస్ఫురణేన విశ్వ
మానందతి ప్రచుర సౌఖ్యవ దావిరించం
తద్బ్రహ్మ పూర్ణసుఖ మాత్మత యోపలభ్య
క స్తత్త్వవి ద్భ్రమితు మిచ్ఛతి శూన్యకల్పే. ౨౨౩

చ. ఎదియొకకొంచె మొక్కరవ యింత స్ఫురించినయంతమాత్రన
మ్మదమునఁ బొంగు విశ్వము సమగ్రసుఖాప్తిని బ్రహ్మదాక న
ప్పదము ప్రపూర్ణసౌఖ్యమగు బ్రహ్మమెతానని దానిఁబొంది త
ద్విదుఁడగు నెవ్వఁడైన భ్రమఁద్రిమ్మరఁ గోరునెవట్టియూకలన్.

శ్లో. బాలోపి శర్కరాం లబ్ధ్వా తయా నందతి నో మృదా
కథం ను బ్రహ్మవి ద్బ్రహ్మ హిత్వా నందే న్మృషాత్మని.

తే. గీ. బాలుఁడును చక్కెరనుగొని కేలిసల్పు
మన్నుఁగొని యాడుకొనఁనొల్లఁడన్న బ్రహ్మ
విదుఁడు బ్రహ్మము విడనాడి ముదముఁబొంద
నిచ్ఛగించునె వట్టిదా సృష్టియందు? ౨౩౩

శ్లో. స్వాత్మానమేవ విషయేషు విభావ్య తత్రా
నందం వహామి ఇతి నాత్మని భావనీయం
క్షీరం స్వకీయ ముపగృహ్య పరస్య గేహే
పాతుం క ఇచ్ఛతి జనో గురులాఘువజ్ఞః. ౨౨౪

తే. గీ. విషయముల నాత్మగానె భావించి యందు
సౌఖ్యమొందెదనని తలంచఁగరాదు

ఇంటిపాల్గొని చని పొరుగింటఁ ద్రావ
నెంచునే పరువెఱిగిన యెవ్వఁడైన ? ౨౩౪

శ్లో. సంసారకారణం విద్ధి వాసనై వాత్ర దేహినాం
శక్తి స్సా ప్రకృతి స్సైవ హ్యవిద్యా విక్షేపనామికా. ౨౭౬

తే. గీ. దేహధారుల సంసృతిం ద్రిప్పుచుండు
కారణము వాసనయె దానిపేరె శక్తి
ప్రకృతియనఁగ నవిద్యనాఁ బరగు నదియె
యదియెసుమ్ము విక్షేపసమాఖ్యగలది. ౨౩౫

శ్లో. సుషుప్తేః పునరాయాంతి సత్సంపద్యాపి జంతవః
ఆవృతే ర్వాసనాయాశ్చ బలేనైవ చ కర్మణా. ౨౭౭

ఆ. వె. నిద్రయందు జంతునివహంబు సత్తునఁ
గలియుఁగాని మఱల వెలికివచ్చు
నావరణముబలిమిచే వాసనాస్ఫూర్తి
వలనఁ గర్మబలమువలనఁ జూవె. ౨౩౬

శ్లో. స్వవాసనాప్రేరితఏవ వర్తతే
సర్వోఽపి లోక స్సకల క్రియాసు
సంసారబంధః ఖలు వాసనాకృత
స్తన్ముక్తిరే వాత్మవిదాం విముక్తిః. ౨౭౮

క. జనమంతయుఁ దమతమవా
సనలే ప్రేరింపఁ జేయు సకలక్రియలన్

ఘనసంసృతిబంధము వా
సనలనెయగు; ముక్తి యద్ద్విజాలుకెు సునిమ్మా. ౨౩౭

శ్లో. వాసనాతానవం రామ ముక్తిరి త్యాత్మవిత్తమః
వసిష్ఠః ప్రాహ య త్తస్మా త్కర్తవ్యో వాసనాక్షయః.

తే. గీ. వాసనలు సన్నమగుటయే వాస్తవముగ
ముక్తియని పల్కె శ్రీరామమూర్తితోడఁ
దత్త్వవిదుఁడు వసిష్ఠుండు తాని గాన
వాసనల నాశమొనరింపవలయు బుధులు. ౨౩౮

శ్లో. బ్రహ్మాత్మైకత్వబోధేన విస్తారావరణస్య తు
వాసనానాం క్షయః కర్తుం శక్యతే బ్రహ్మనిష్ఠయా. ౨౪౦

తే. గీ బ్రహ్మమే తానను తెల్వివలన నెవని
కావృతి నశించె శక్యమౌ నతని కెపుడు
బ్రహ్మనిష్ఠను సల్పుటవలన వాస
నల వినాశంబొనర్ప నన్యులకుఁ గాదు. ౨౪౧

శ్లో. నిశ్శేషావృతివిధ్వంసే వాసనాసంతతిక్షయే
యతే ర్విదేహకైవల్యం స్వయంసిద్ధ్యతి నాన్యథా. ౨౪౨

తే. గీ. ఆవరణ మంతయును నాశమంది సర్వ
వాసనలు జీర్ణమైనచో వచ్చుఁ దాని
యతులకు విదేహకైవల్య మనెడిపదవి
వేఱుతెఱఁగులఁ గలుగదు వేయునేల? ౨౪౩

శ్లో. స్థూలస్యాపిచ సూక్ష్మస్య కారణస్యాపి వర్ష్మణః
సమ్య గ్వినాశః కర్తవ్య స్తత్తస్మిన్యతసాధనైః. ౨౮౨

క. విను స్థూలసూక్ష్మకారణ
తవునుల మూడిటిని బట్టి తత్తదుచిత సా
ధనముల నిర్మూలములుగ
వినాశమొందింపనొప్పు విజ్ఞులకెల్లన్. ౨౮౧౪

శ్లో. స్థూల స్త్వన్నమయో దేహః సూక్ష్మస్స్యా ద్వాసనామయః
మూలాజ్ఞానం య త్తదేవ శరీరం కారణాభిధం. ౨౮౩

తే. గీ. అన్నమయ మిది స్థూలదేహంబు సూక్ష్మ
మనఁబడును వాసనామయమైన తనువు
మూలమైనట్టి యజ్ఞానమునకుఁ బేరు
కారణశరీరమని సువిచారనిపుణ. ౨౮౪

శ్లో. బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానశక్త్యైవ బ్రహ్మవిద్రతిః
నాశయేత్కారణం దేహ మనుర్వేక్కించిదంతరం. ౨౮౪

తే. గీ. బ్రహ్మవేత్తలతోడ నిరంతరంబు
సక్తుఁడై స్వానుభూతినిమ్మగ్నుఁ డవుచు
తాను బ్రహ్మంబయైనిల్చుద్రఢిమ భేద
దృష్టిమాసినఁ గారణదేహ మణఁగు. ౨౮౩

శ్లో. విశ్వం బ్రహ్మాత్మనా పశ్య న్మజస్రం వాసనాతనుం
నిర్మూల్య బ్రహ్మవి ద్యాతి ముక్తిం నిర్వాణలక్షణాం. ౨౮౫

తే. గీ. మఱువ కీవిశ్వమెల్ల బ్రహ్మంబుగాగఁ
గనుచు నల్లన వాసనాతనువు దుంప
ద్రెంచి మఱిపుట్టకుండు ముక్తియనుదశను
బ్రహ్మవిదుఁ డొందుఁ జిరసౌఖ్యపాత్ర మగుచు. ౨౪౩

శ్లో. అకర్త్రాత్మజ్ఞానవహ్నిజ్వాలాయాంత్రివిధం స్ఫుటం
కర్మదగ్ధ్వా స్వయం తస్మాన్ముక్తస్థూలం వినాశయేత్. ౨౮౬

ఆ. వె. తానకర్తననెడి జ్ఞానమ న్వహ్నిలో
మానకుండు త్రివిధమైన కర్మ
మెల్ల లెస్సఁగాల్చి యల్లన విడుపొంది
స్థూలతనువు మాపఁజాలు మౌని. ౨౪౪

శ్లో. బ్రహ్మైవాహ మిదంవిశ్వ మితి విశ్వస్య చాత్మనః
బ్రహ్మమాత్రత్వవిజ్ఞానం నిరర్గళమనారతం. ౨౮౭

శ్లో. యదా తదా మృతేర్నాశో నిశ్శేషఇతి బుద్ధ్యతాం
నాహం మమేద మిత్యాది ప్రత్యయః పరబోధనాత్. ౨౮౮

శ్లో. యదాభవతి సూక్ష్మస్య తదా నాశఇతీష్యతాం
కారణస్యాపి సూక్ష్మస్య వినాశేసతి వర్ష్మణః. ౨౮౯

శ్లో. ప్రతిక్రియాం వినా భోగః ప్రాప్తయో స్సుఖదుఃఖయోః
యదా సమాప్తి స్థూలస్య తదాంతఇతి మీయతాం. ౨౯౦

శ్లో. స్థూలకారణసూక్ష్మాణాం త్రయాణాం యస్యకస్యచిత్
యత్కించి దవశిష్టత్వే సతాం ముక్తి ర్దవీయసీ. ౨౯౧

సీ. ఏను నీవిశ్వమిదెల్ల బ్రహ్మమెయని
విశ్వమూర్తి దన్నును విడువకెపుడు
బ్రహ్మమాత్రంబుగాఁ బరికించిచూడ నీ
కారణతనువెల్లఁ గఱగిపోవు
నిదినేనుగాను నాయదియిదికాదని
పరమెఱింగిన సూక్ష్మ వపువుపోలియు
కారణసూక్ష్మశరీరముల్నశియింపఁ
గలిగెడు సుఖదుఃఖములను మాన్ప
తే. గీ. కనుభవించుచు ముగియింప నపుడు స్థూల
దేహము నశించు నీమూఁడుదేహముల నొ
కింతయేనియు శేషించు నెందు నెవని
కాతనికిఁ జూడ మిగులదవ్వగు విముక్తి. ౨౪౭

శ్లో. తస్మా ద్దేహత్రయం సద్భి స్తత్తత్సాధననిష్ఠయా
విధ్వస్యతాం ప్రయత్నేన నిర్వాణసుఖసిద్ధయే. ౭౯-౨

తే. గీ. కాన నయ్యయిసాధన లూని చేసి
మూఁడుతనువుల విధ్వంసమును ప్రయత్న
మున నొనర్చెడు సాధువుల్ ఘనవిమోక్ష
సౌఖ్యమెల్లను ననుభవించంగవచ్చు. ౨౪౮

శ్లో. అసత్ప్రవృత్తి మే వాహు ర్నిష్ఠాయాః ప్రతిబంధకం
అసత్ప్రవృత్త్యాఽహంభావ ఇచ్ఛాదోషోపి వర్ధతే. ౭౯-౩
విద్వానపిచ తద్వృద్ధ్యా పతత్యేవ నసంశయః. ౭౯-౩½

తే. గీ. జగము నిజమని పనిసేయుటగును విఘ్న
మాత్మనిష్ఠకు; దాన నహమ్ము పుట్టు
నంతఁగోరికదోషంబు నధికమగును
వానివృద్ధిఁ బండితుండైనఁ జెడును. ౨౪౮

శ్లో. ఆత్మానంచ జగచ్చాపి పూర్ణం బ్రహ్మైవ పశ్యతః
యతేరేవ విముక్తిస్స్యా న్నకించి ద్భేదదర్శినః. ౨౯౪

తే. గీ. తన్ను జగమునుఁ బూర్ణమైయున్న బ్రహ్మ
మే యనుచుఁ జూచుయతివరుండే విముక్తి
నొందుఁ గాని భిన్నంబులై యున్నయట్లు
చూచువానికి మోక్షంబు సున్న సున్న. ౨౪౯

శ్లో. 'యదాహ్యేవైష ఏతస్మిన్నుదర' మిత్యేవహి శ్రుతిః
ముక్త్యభావం జ్ఞానినోపి ప్రబ్రూతే భేదదర్శినః. ౨౯౫

తే. గీ. ఈతఁ డెప్పుడు దీనియం దెంతయైన
భేదముగఁ జూచునపు డగు భీతి యితని
కనుచు శ్రుతి భేదదృష్టిగలట్టి జ్ఞాని
కైనను విముక్తిలేమిఁ దథ్యముగఁ జెప్పె. ౨౫౦

శ్లో. యస్సర్వత్ర బ్రహ్మదృష్ట్యా సర్వం బ్రహ్మైవ పశ్యతి
వాసనా స్తస్య లీయంతే స్వకార్యై స్సహసా సహ. ౨౯౬

తే. గీ. ఎవ్వఁ డంతట బ్రహ్మమను దృష్టిచేత
నంతయును బ్రహ్మముగ గను నట్టివాని

కన్నివాసనలును స్వకార్యములతోడ
తత్క్షణమ నాశమొందును తథ్యముగను. ౨౫౧

శ్లో. త్వ మహ మిద మితీవ భేదదృష్టిః
ప్రభవతి వాసనయా విపశ్చితోఽపి
తదపనయనతోఽఖిలాత్మభావో
భవతి తదాఽప్రతిబద్ధబోధసిద్ధిః ౯౭

తే. గీ. పండితునకైన వాసనాబలముచేత
నీవు నే నిది యనుభేదదృష్టి వొడము
నది తొలఁగఁద్రోయఁ దాని యీయఖిలమనెడి
బుద్ధియగు; నంత సద్బోధ సిద్ధి వెలయు. ౨౫౨

శ్లో. అప్రతిబంధే బోధే సర్వంబ్రహ్మైవ చేతసో భవతి
నాస్తి తదా సంసారో భవతిసదానందసౌఖ్యవిస్ఫూర్తిః ౯౮

ఆ. వె. అడ్డులేనిబోధ మమరిన బ్రహ్మమే
సర్వమనుచుఁదోచు స్వాంతమునకు
నపుడు మాసిపోవు నఖిలసంసారంబు
విమలకుండు సుఖము వెల్లివిరియు. ౨౫౩

శ్లో. జగద్భావం పరిత్యజ్య బ్రహ్మమాత్రత్వభావనా
వాసనాప్రక్షయోపాయ స్సులభ స్సూరిసమ్మతః. ౯౯

తే. గీ. ఇదిజగంబను భావంబు నెడలవిడిచి
బ్రహ్మమాత్రంబుగా దీనిఁ బరగఁ జూచు

చుండుటే వాసనలను లేకుండఁజేయ
సులభమగుమెర; నిది మహర్షుల మతంబు. ౨౯౮

శ్లో. సన్మాత్రత్వావలోకేన సదా సర్వత్ర సర్వతః
వాసనాక్షయ మాయాతి సత్య మత్ర న సంశయః. ౩౦౦

తే. గీ. ఎప్పుడును నెల్లదెసలను నేది చూడ
నంతయును సత్తుగాఁ జూడు; మంత నంత
మొందు వాసనలన్నియు; నిందు సంది
యం బొకింతయు లేదు; సత్యంబు వత్స. ౨౯౯

శ్లో. చండాలస్పృష్టివ ద్దేహతాదాత్మ్యం దూరత స్త్యజ
సత్తామాత్రితను ర్భూత్వా స్వరూపే నివసే న్మునిః. ౩౦౧

తే. గీ. తనువు తానయి యుంట నూలని స్పృశించు
నట్లుగా నెంచి దూరంబునందు విడిచి
తనకుఁ దనువు సత్తామాత్రమనఁగఁ దత్స్వ
రూపుఁడై యుండు మానివర్యుండు జగతి. ౩౦౨

శ్లో. బ్రహ్మైవాహ మిదంసర్వ మితి విజ్ఞాన వహ్నినా
దగ్ధ్వా ద్వైతవనం సమ్య గద్వితీయో భవే న్మునిః. ౩౦౨

తే. గీ. బ్రహ్మమే నేను నిద్దిసర్వంబు ననెడు
తీవ్రవిజ్ఞానవహ్నిచేఁ దీటిపోవ
ద్వైత వనమెల్ల లెస్స దగ్ధంబు చేసి
రెండవదిలేక తనయంత నుండు మౌని. ౨౯౭

శ్లో. బ్రహ్మైవాస్మీతి బోధేన దేహోఽహామితి ధీపశుం
కృత్వా పూర్ణాహుతిం బ్రహ్మ ణ్యశరీరో భవే న్మునిః. 303

తే. గీ. తనువు నేననుకొను మతియనెడు పశువుఁ
బట్టి బ్రహ్మంబె నే నను ప్రజ్ఞ చేత
బ్రహ్మమను నగ్నియందుఁ బూర్ణముగ వేల్చి
మౌని యశరీరుఁడై యుండనొను భువిని. ౨౫౮

శ్లో. స్వప్నార్థవ జ్జగత్సర్వ మపశ్యన్నేవ సర్వదా
శాంతాత్మా బ్రహ్మరూపేణ సర్వదా నివసే న్మునిః. 304

తే. గీ. కలనుఁ దోచిన లోకంబు కరణి జగము
సర్వమునుఁ జూడకయె మౌని సంతతంబు
శాంతుఁడై బ్రహ్మరూపంబు శాశ్వతంబు
నొంది యెప్పుడు నివసించుచుండు జగతి. ౨౫౯

శ్లో. విద్వా నహంతాం మమతా మిదంతాం
త్యక్త్వా పరబ్రహ్మ సమీక్ష్య సర్వం
తదేకవృత్త్యా స్వయమేవ తూష్ణీ
మాస్తే యదైవైష సమాధి నిష్ఠః. 305

తే. గీ. ఏననుట నాదియనుటయు నిద్దియనుట
విడిచి విద్వాంసుఁ డెప్పుడు విశ్వమెల్ల
నాపరబ్రహ్మముగఁ జూచి యట్లె మిన్న
కుండు నపుడు సమాధిలో నుండు నతఁడు. ౨౬౦

శ్లో. యత్తు పృష్టం త్వయా పూర్వం ప్రకృతి ప్రవిలాపనం
త దిదానీం ప్రవక్ష్యామి సమాసేనైవ సాదరం. 30౬

తే. గీ. ప్రకృతి లీనం బొనర్చెడుభంగిఁ దెల్పు
డనుచు మున్నీవు వేడితి వద్ది యిపుడు
సాదరంబుగ వివరింతు సావధాన
చిత్తమున విను సంశయోచ్ఛేద మగును. ౨౬౧

శ్లో. సర్వాసాం దృశ్యవృత్తీనాం తత్తద్వాసనయాసహ
బ్రహ్మాత్మ దర్శనం యత్తు ప్రకృతే ర్లాపనం హి తత్. 30౭

మత్తకోకిల.

దృశ్యవృత్తుల నెల్లఁబట్టి తదీయ వాసనతోడ వి
భ్రశ్యమాన భుజంగమంబగు రజ్జువ ట్లనిశంబు సా
దృశ్యహీనము బ్రహ్మమే యను దృష్టిఁ జూచుటచేత నా
దృశ్యమై కనుపట్టు నీప్రకృతిన్ విలీన మొనర్పఁగన్. ౨౬౨

శ్లో. రజ్జౌ ప్రతీతో భుజగో వివేకా
ద్బుద్ధైర్యథా రజ్జుతయైవ గృహ్యతే
విలాపనం తజ్జగత స్తథాయం
ప్రత్యగ్దృశా బ్రహ్మతయావధారణం. 30౮

—: ఓం తత్సత్ :—

ఇతి శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ మదద్వైత విద్యా చార్య
శ్రీ భా ష్య కా ర
శ్రీ
శ ం క ర భ గ వ త్పా ద
విరచితమ్
మ హా వా క్య ద ర్ప ణ మ్
సమాప్తమ్.

శా. త్రాటందోఁచిన పాము త్రాడెయని పెద్దల్ దానిశోధించి య
ప్పాటుం గన్గొనుమాడ్కి నెన్నగనుఁ దత్త్వజ్ఞుల్ విచారించి వే
ర్పాటై బ్రహ్మమె యీజగమ్మని స్వతత్త్వంబొందుచే నిక్కమౌ
సూటిన్ విశ్వము బ్రహ్మమందణచుటౌ సుమ్మీ నిజమ్మింతయున్.

—: ఓ ం త త్స త్ :—

ఇది శ్రీ మత్పరమహంస పరివ్రాజకా చార్యులును
శ్రీ మదద్వైత విద్యా చార్యులును
శ్రీ భా ష్య కా రు లు న గు
శ్రీ శంకర భగవత్పాదా చార్యుల వారిచే
విరచింపంబడిన
శ్రీ
మ హా వా క్య ద ర్ప ణ ము.
సమాప్తము.

—:O:—

## కృతి సమర్పణాదికము.

శా. ఓంకారార్థము సర్వశాస్త్రహృదయార్థోద్బోధదక్షుంబు ని
శ్శంకాశావిజయాత్త సద్యశము శ్రీసర్వజ్ఞపీఠాధిరా
ట్ఛాంకాలంకృతసచ్చరిత్రము శివానన్యంబు లోకైకని
ష్పంకాకారము శంకరాభిధము తేజం బెప్పుడున్ వెల్గుతన్

—: శ్రీ శంకర సద్గురు చరణారవిందార్పణమస్తు :—

తే. గీ. వేదచంద్ర చతుర్ముఖ విధు సమాంక
హూణ శకవత్సరంబున దీనియర్థ
మాంధ్రులకు సందఁజేసె నిందాంధ్రపద్య
రచనఁ గోవూరి పట్టాభిరామ శర్మ.

సీ. శ్రీమంతమగునాంధ్ర సీమలో గుంటూరు
మండలి బాపట్ల నుండినట్టి
దండి వకీలు బ్రహ్మాండము బాపయ్య
కీర్తిశేషుడు వారిగృహిణియన్న
ధాత్రి రామాయమ్మ తనయుండు వెంకట
లక్ష్మీనారాయణ లక్షణాఖ్యు
డీ యిద్దఱకృతి నెలమిజక్కఁగవిని
యచ్చువేయింపనర్థమిచ్చి

తే. గీ. తమయశము భూమిపై శాశ్వతముగ నెగడు
నట్లొనర్చిరి వీరికి నఖిల శుభము
లెల్లకాలము గలుగు నట్లీశ్వరుండు
మంచిదయతోడుత ననుగ్రహించుగాక.

---

# మాయొద్ద వెలకుదొరకు మందులు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. పంచశరసేవ్యము (వీర్యవృద్ధికిని మేహవ్యాధులకును దివ్యౌషధము) 40 దినముల మందు | వెల | | రు | 10-0-0 |
| 2. తాంబూలమాత్రలు - | వెల | సీసా | | 0-4-0 |
| 3. విషూచివిధ్వంసిని (కలరామాత్రలు) | ,, | ,, | | 0-8-0 |
| 4. శివామృతతైలము (తలంటుకు) | ,, | ,, | | 0-12-0 |
| 5. నారికేళాంజనము | ,, | ,, | | 0-8-0 |
| 6. ఆదిత్యరసము (అజీర్ణమాత్రలు) | ,, | ,, | పెద్దది | 1-0-0 |
| | ,, | ,, | చిన్నది | 0-8-0 |
| 7. నవరత్నాంజనము (అన్నినేత్ర రోగములకు సుర్మావంటిపొడి) | ,, | ,, | | 1-0-0 |
| 8. ఓమాస్వర్కము (కలరామందు) | ,, | ,, | | 0-8-0 |
| 9. సుగంధపాలషర్బత్తు | ,, | ,, | పెద్దది | 1-4-0 |
| | ,, | ,, | చిన్నది | 0-10-0 |
| 10. దంతశోధిని (పండ్లుతోముపొడి) | డబ్బా | | | 0-8-0 |

మందుల మోతాదులు అవి ఉపయోగించుకొను పద్ధతులును మందుల వెంటచేయుండును.

☞ మాయొద్ద సుప్రసిద్ధాయుర్వేద శాస్త్రీయౌషధములును చక్కగా చేయబడిన తలంటు తైలములు నేత్రాంజనములును విక్రయమునకు సిద్ధముగానున్నవి.

విలాసము:—

విశ్వనాథం సుబ్బరామయ్య,
ఆయుర్వేద వైద్యుడు.
ప్రబుద్ధాశ్రమము
కొవ్వూరు,
(నెల్లూరుజిల్లా.)

శ్రీరస్తు.

# నెల్లూరి యొద్దనుండు కోవూరిలో ప్రబుద్ధాశ్రమమున విక్రయమునకు సిద్ధముగనుండు గ్రంథములు.

## శ్రీ శంకరభగవత్పాదాచార్య ప్రణీతములగు

1. వివేకచూడామణి (ఆంధ్రపద్యసహితము) రు 0-8-0
2. మహావాక్యదర్పణము ,, 0-8-0
3. అపరోక్షానుభూతి ,, 0-4-0
4. దృగ్దృశ్యవివేకము ,, 0-2-0
5. ఆత్మానాత్మవివేకము (ఆంధ్రీకృతవాక్యగ్రంథము) 0-2-0

## శ్రీసురేశ్వరాచార్య (పూర్వాశ్రమ మండనమిశ్ర) కృతమగు

6. పంచీకరణవార్తికము (ఆంధ్రపద్యసహితము) 0-2-0

## కోవూరు పట్టాభిరామశర్మ కృతములగు

7. సతీవిజయము (తెలుఁగు నాటకము) 0-6-0
8. శ్రీరామ శతకము శ్రీరామాష్టోత్తరశత నామగర్భము చిత్రము.) 0-2-0
9. శ్రీ భగవద్గీతార్థమంజరి (పాట) గీతాతాత్పర్యమంతి సులభముగాఁ దెలుపునది. 0-2-0
10. శ్రీభగవత్ప్రార్థనా పద్యావళి (బాలురకుపయుక్తము) 0-0-3

ఇవి నెల్లూరు లక్ష్మీవిలాసకంపెనీలోఁ గూడ దొరకును.